## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016020

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శుభమస్తు

# భక్తపుండలీక.



(భక్తిరసమైన నాటకము.)



గ్రంథకర్త.

వసంశంకరశర్మకవి.

పత్తికొండ.




ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

పత్తికొండ, కర్నూల్ జిల్లా.

1938.




[ వెల రు. 0-12-0

# తొలి పలుకు.



మహాశయులారా?

నేనీ గ్రంథమును ముద్రించుటలో గ్రామఫోను సెట్టు నుండి కథా భాగము నంతయు చదివి అందలి భావమునంతయు గ్రహించి నాటకమునకు యోగ్యమగు నట్లుగా నాశక్తి కొలది మార్పు జేసి వ్రాశి ప్రదర్శింపజేసితిని. అనేక జనులచేత పొగడ్తకెక్కెను. ఇందున సీ॥ నవమాసములు మోసి" సీ॥ కడుపుదునా పదకంజముల్„ ఈరెండు పద్యములు మిగుల రసవత్తరముగా నుండుట చేత నేవ్రాయు పద్యములు ఇంతకన్న నుత్తమముగానుండజాలవనినమ్మి, వాటినేవాడు కొంటిని. పైపద్యములు వ్రాసిన మహా కవికి వందన సహస్రములు.

ఇక నాటకమున భాష యందేమి, పద్యములందేమి, కీర్తనలందేమి, నెరసులు లేకుండయుండవు. వాని నెల్ల పండితులు, కవులు, సవరించి పునర్ముద్రణమున నాకుసవరించు కొనునట్లును, తమ తమ సదభిప్రాయములను తెల్పునట్లు ప్రార్థించు చున్నాడను.

## మనవి.

---

గీ॥ పాడు రంగని మది యందు • భక్తితోడ
దలచి వ్రాశితి సీచరి • త్రమును నాకు
దోచినట్లుగ నిందున • దోసగులున్న
కవులు సవరించి కరుణతో • గాంతుగాత ॥

ఇట్లు గ్రంథకర్త
వనం శంకర శర్మ కవి,
పత్తికొండ, కర్నూలు జిల్లా.

# ఈ నాటకమునందు వచ్చుపాత్రలు.

## పురుషులు.

| | | |
|---|---|---|
| 1 | పుండలీకుడు.— | కథానాయకుడు |
| 2 | జహ్నుశర్మ.— | పుండలీకుని తండ్రి |
| 3 | సంబంధం,— | నళిని తమ్ముడు |
| 4 | కుక్కుటస్వామి.— | యోగి |
| 5 | కృష్ణుడు.— | |
| 6 | పుల్లన్న. } — | భక్తులు |
| 7 | మల్లన్న. } | |
| 8 | భజన సంఘము | |

## స్త్రీలు.

| | | |
|---|---|---|
| 9 | జఖాభాయి.— | పుండలీకుని భార్య |
| 10 | సత్యవతి.— | ” ” తల్లి |
| 11 | నళిని.— | వేశ్య |
| 12 | రుక్మిణి — | |
| 13 | గంగ యమున సరస్వతులు.— | |



శ్రీరస్తు.

# భక్తపుండలీక.



## ప్రథమాంకము.

[లోహదండనగరపువీధి.]

(భజన సంఘమువారు భజన చేయుచు ప్రవేశింతురు.)

భక్తులు—శ్రీమద్రమా రమణ గోవిందో గోవింద.

కీర్తన - రూపకతాళము.

సీతారాముల భజన సేయుదమా ఘన భక్తులందరుగూడి పాడుదమా ॥ మనసీతా ॥

నిండు మనముతోడ నిర్మలముగ మరి । దండిగ సంస్మరణ సలుపుదమా ॥ సీతారాము ॥

రండి వేగ లెండి రయమునగూడండి దశరథరాముని ప్రణుతింతమా ॥ మనసీతారాముల ॥

భక్తులు—ఏమయ్యో మన పుండలీకుని తండ్రి జహ్నుశర్మగారు పరమ భక్తులు, వారిని దర్శించి వారితో గూడ శ్రీహరిని స్మరించి వారితో జేరిభజన మొనర్చిన, వారందరు పుణ్యాత్ములగుదురట త్వరగా బోయి వారిని దర్శించిమనము ధన్యులగుదము రండు.

కీర్తన - ఏకతాళము.

లెండి సుజనులార। మన రాధాకృష్ణుని జూడబోదము ॥ లెండి॥

రండి వేగమె మీరు, బలు నిండు మనము తోడ భజన।

దిండిగ సేయుచునుసంతోషముగను యిక మెలగుదాము॥ లెండి॥
గోవిందుని కనుగొందము గోపాలుని భజయింతము। వేడు
కతో పాడుదము ఆనందము పొందుదము॥ లెండి॥

(అందరు వెళ్లుదురు.)

(పుండలీకుని గృహము.)

(జహ్నుశర్మ సత్యవతి రాధాకృష్ణవిగ్రహములను పూజించుచుందురు.)

జహ్ను—॥శ్లో॥ అనుగ్రహాయ లోకానాం మవతీర్ణాయ విష్ణవే।
క్లేశాపహాయ కృష్ణాయా పార్థసారథయేనమః॥

కీర్తన—ఆది

భజగోవిందం భజగోవిందం గోవిందం భజామూఢమత్తే॥భజ॥
సంప్రాప్తేసన్నిహి తేకాలే నహినహిరక్షతిడుక్రృఞ్కరణే।భజ॥

సత్య—నాథా! మనమనవరతము సిట్లిరువస్థల ననుభవింపవలసినదేనా.
ప్రతిమానవునకు కొన్నాళ్లకష్టములు కొన్నాళ్లసుఖములు గ
లుగుచుండునని విన చుంటిమి, మనకు మాత్రే, లేనట్లున్నది.

జహ్ను—తెస్వీ! మన కెందులకు మార్పు, యెంతయో కాలముగడచె, ము
దుసలులమైతిమి. ఏదో శ్రీకృష్ణ మూర్తిని తలచుచు, కాల
ముగడపిన, అన్ని సుఖములు మనకుగల్గిన ట్లే

సత్య—మహాత్మా! నిక్కమే, నేను కాదనను. మనమెన్నియో వ్రతము
లు జేసి యెంతయో దానధర్మములొనర్చి యేరీతియో భగవదా
రాధనము జేసిన ఫలమునకు లేక లేక ఒకకుమారుడుగల్గిన వా
డు మనపైనితినమూని వనమన్న చో, కన్నెత్తియైన జూడడ
య్యె. గా "అపుత్రస్య గతిర్నాస్తి" యనుస్మృతి పడదాటిన నడచె,
మనకుగతిని గలిగించు కుమారుడు గాక పోయెనని చింతించెద.

జహ్ను—ఏమిసేతెము! మనకర్మము, వానిదౌర్భాగ్యము. పోనీ మనల
ను మాటాడింపకున్న మానెగాని, వానికి సంప్రాప్తించిన భా
గ్యమైన మంచిదిగానుండవలదా.

సత్య—ఔను! వారిర్వురైన ప్రేమతో మెలంగగూడదా.

జహ్న—(నవ్వి) వెర్రిదానా!

గీ॥ పతికి గుణవతి యనుకూల ♦ పతియు సతియు
దొఱకుటయరుదౌను, దొరకిన ♦ త్వరితగతిని
భిన్నముఖ జెందు గాకున్న ♦ నున్ననిట్టి
వారికెందున తావుండ ♦ వలదె చెపుమ॥

సత్య—నాథా నిక్కము, ఇట్టి వారలే పలువురుండిన ఈజగమొక్కని మనసములో తలక్రిందు గాక యుండదు, లేకున్న నొకనాడుగా కున్న నొకనాడైనను మగనిని ప్రేమతో మాటాడించి, ఆదరమున భోజనమిడి, సుఖము లొసంగునదే కాదు. ఔను మీరు వెతకి వెతకి ఇట్లాటి కోడలి నెట్లు తెచ్చితిరో.

జహ్న—ముందు రాగల్గు విషయములను గుర్తెరుంగువారెవరు.

(1 అనుబంధము.)

కామినీ పతిప్రాణేశయు సంప్రాప్తించిన కర్మమనుభవించియే తీరవలయును.

సత్య—పాపము! నాదేమి సేయగలదు, ఆమె యినాకతనరాలు, ఏయ్యాలి, పొగరుబోతు, ఇట్టి వానితో నేగ లేక సౌఖ్యము గానక మరొకదారిననడచె, అప్పటికిని దాని బాధ తగ్గ లేదు.

గీ॥ అవని దంపతులంతి ప్రేమ ♦ సడలియున్న
గాని సంసార సౌఖ్యముల్ ♦ గలిగియుండు
కోర్కెలన్ దీర లేకున్న ♦ కోర్కెతోడ
తనను గోరికొనినయట్లు ♦ దలపవలయు॥

జహ్న—దేవి! మనము వారలను గూర్చి చింతింపననవసరము. "స్త్రీణాం చ చిత్తం పురుషస్య భాగ్యం" అనినట్లు ఒక్కొక్కరి కుటుంబముల

గతి జూచినహరిహరాదులుగూడ తల్లడిలమానరు. పుండరీకవ్య ధాకలాపములను బెంచుకొని నొప్పించుటకన్న భగవత్సేవజేసిన అన్నియుదీరును.

కీర్తన - ఆదితాళము.

సత్సంగత్వే నిస్సంగత్వం । నిస్సంగత్వే నిర్మోహత్వం ।
నిర్మోహత్వే నిశ్చలతత్వం । నిశ్చలతత్వే జీవన్ముక్తిః ॥భజ॥

( జఖాభాయి ప్రవేశం )

జఖా — ఉశ్శో అబ్బా! ఈసంసారముతో నాకుచాలైనది. యెప్పుడుచూచినవండడం, వచ్చినవారికిల్లాపెట్టడం, పైన ఈముసలిపీనుగులకి చాకిరిసేయడం వేళకుతిండిలేకనే మాడడం, ఇంక నీముద్దుమగనితో కాపురమేడ్చడం.

॥గీ॥ వలదుపాపిష్టికాపుర ♦ మిలనుయెట్టి
తరుణికైన నిందు జగమున ♦ తన్వీగాను
బుట్టుగారాదు పుట్టిన ♦ పుణ్యుడైన
మగడుగానన్నచాలును ♦ మగువసుఖము ।

( ౨ అనుబంధము )

( సమాపించును. )

జహ్నుసత్య ( ౩ అనుబంధము ) [భజనసేయుచుందురు.]

జఖా—ఓముదుసలులారా యెప్పుడు మీ అల్లరియే సరిపోయినది. రాత్రిలేదు, పగలులేదు, కాలములేదు, సమయములేదు. ఒకేగాబర, మీగొంతులకొయ్య చింతలేదు, చీకటిలేదు. భజన, భజన, ఏమిమీశ్రాద్ధంభజన. బాగుగాచేశిందిసమయానికి మొక్క పుండరీకుండు బుద్ధినివ్వదుగాబోలు. ముసలివాళ్లని యేదో పాపమంటే మీరూరికె యెట్టుందురు. తొలిఝామైనా దాటలేదు, పెడబొబ్బలు, కూతలు, గంతులు, కేకలు వేయడమా

మూర్తిని, నీమగడొక కర్మమూర్తి, నీకొడుకొక త్యాగమూర్తి, మూర్తులు మూడు జేరి నాజీవితము పూర్తి జేశారు.

జహ్నా—అమ్మా! యెవరేమి సేయజాలరు. మనకై నేల దూరెదవు. అంతయు దైవానుగ్రహము. ప్రతికార్యమాతని యాజ్ఞచేతనే జరుగుచుండును. అతడే నమ్మిక దైవము.

గీ॥ దైవమును నమ్మకున్న మా ♦ నవుడు భువిని
బ్రతుకజాలడుమరియు నే ♦ ప్రాణికైన
సుఖములొందునె యైశ్వర్య ♦ శుభములెల్ల
నిల్వజాలవు శూన్యమా ♦ నిజమునిజము

జఖా—చాలు చాలు మీశుష్క వేదాంతములు.

(తెర పడును.)

(పుండలీకుడు ప్రవేశం)

గీ॥ బ్రతికి యున్నంతకాలమీ ♦ భార్యతోడ
ముసలి తలి తండ్రులను గూడి ♦ వ్యసనపడుచు
నేగవేసిన విధి నాకు ♦ నెటులదప్పు
సేమమేనాటికైనన్ ♦ జేరదయ్యో॥

(పాడుకునడచును)

(జఖాభాయి ప్రవేశించును)

పుండ—ఏమిటే ఈ ముదుసలులతో వ్యవహారము.

జఖా—యేమున్నది కాటికి కాళ్లు దాచినా వీరిమంకు, వీరిబింకము, వీరి మదము, వీరి గర్వము తగ్గుటలేదు. కొంపలో పెత్తనమంతయు వీరిదే. వీరల్లాడించిన నేనల్లాడవలసిందే. అనుభవించుదానను నేనొక్కతెనేగదా. అందులకే ఈ వ్యవహారము.

పుండ—నీ వొకతెవే యొదుకు నేను మాత్రిమను భవింప న్నాడనా?

జభా—అందుకే కాబోలు వీరి నోర్లు యింత పొడవైనవి.

పుండ—జభా! వీరేమనిరి,

జభా—యేమన్నను పడవలసిందేగా నీవు తీర్చగలవా? అట్లున్నను ఇట్లగునా? అబ్బబ్బా! అంతా ఊరే పరమ్మ గన్న ఆడుబిడ్డ ను నేనొకతెనే గదా?

(4 అను బంధము.)

పుండ—కామినీ! యెంతటి విపరీతముగ మాట్లాడుచున్నావు. వారన్న దేదియో విదానముగ జెప్పుము?

జభా—యేమి జెప్పునది.

కం॥ తమదే నటవిల్లంతయు
తమదే నటభూమి బుట్రి ◆ తమదేధనముల్
తమవారే నటమీరును
తమకును తెమవారికెల్ల ◆ తగనేనొకతే॥

ఇంకెన్ని మోగబట్టు. అవన్నితలంచుకొన్న చక్కని ఆడుబిడ కక్క నిముసము గూడ కాపురము సేయను. చాలైనది. నీ వంటి నిర్భాగ్యుని బాపరించుటయు, కాపురమీగతి పట్టుట యు, ఇంక నాచేత గాదు. నితరిదంప్పలు నీకును యేగతియై న చూపుడు. నాకీ ఫురమే వలను. (పోవుచుండగా పుండ లీకుడు పట్టుకొని)

పుండ—వెర్రి మొగమా! వారలన్నంత మాత్రిమునసే అంతయు నను భవింపిరా. అంతయును నీదిగాదా, నాదిగాదా.

జభా—(నవ్వి) నరే మీరైరై అన్నారు గాబట్టి నేనొకటి ఇండిలిము గా

మిమ్మల్నడుగ నిశ్చయించుకున్నాను. ఈ యిల్లు యెవ్వరిది? జాగ్రత జాగ్రతగా జెప్పుము.

పుండ—నాది.

జఘా—ఇదో చూచితివా! నీవనియున్నవో నెత్తిన పెట్టుకొని పోవు చుంటివా!

పుండ—కాదే! నాదైన నీదనియే. నీదైన నాదనియే. నేను నీవాడను గానా! నీవు నావాడవుగాదా?

జఘా—అట్లయిన ఖండితముగా నాదనియే నిశ్చయింతువా?

పుండ—మాటికి ముమ్మాటికి.

జఘా—అట్లయిన నీకీక్షణమునుండియే నా యింట్లో నాయాజ్ఞ చెల్లవలసిన దేనా?

పుండ—అబ్బా! యెల్లప్పటికి నీయాజ్ఞయే.

జఘా—నీవు కూడ నాయాజ్ఞకు బద్ధుడవేగదా?

పుండ—లేకున్న

జఘా—ఆలోచించుకొనుము. నాయాజ్ఞతప్పిన అనర్థము వాటిల్లును సుమా!

పుండ—తప్పిన గదా అనర్థము.

జఘా—అట్లయిన వినుము. ఈముసలి పీనుగలను ఈ రోజుతోనుండి మన యింటిలో నుండనీయక తోసివేయుడు. వీరి సాంగత్యమే మనకు వలదు. యేమి చేయగలవా?

పుండ—అబ్బా! ఇంతకేనా ఈ వ్యవహారం. నీవు చెప్పకముందే ఈపని జేయుదమని నిశ్చయించుకొనియుంటిని. కాని నీవును తోడైతివి. రమ్ము ఇక నీవు జూచుచుండగనే వారలగతి యేమిజేతునో కనుగొనుము.

జహ్నా—నాథా! నీవు తలిదండ్రులని మెత్తని మనస్సుతో మాట్లాడించి నవారెంతమాత్రము నీకు లొంగరు. ముందుబోయిన కొలది నీ ప్రహారణములు సేయుట ప్రధానము. ఆమీాదట బయట కీడ్చుటయు, ఇంతమాత్రము నీపని.

పుండ—సరే రమ్ము. (నిష్క్రమించుట)

(తెర బడుట.)

—(ఇంటిలో జహ్నునిత్య భజన సేయుచుందురు.)—

కీర్తన—ఆది

పునరపి జననం పునరపి మరణం పునరపిజననీ జఠరేశయనం ।
ఇహసంసారే బహుదుస్తారే కృపయాపారే పాహిమురారే ॥భజ॥

[పుండ — జఖా ప్రవేశం]

పుండ—ఓ ముసలులారా! ఏమీగడబిడలు.

జహ్ను—నాయనా! కుమారా! గడబిడ లేమియు లేవు. భగవద్ధ్యానము

పుండ—మీాధ్యానము చాలును. పూరకె తిని పడియుండలేక మీాకు మదము తలకెక్కినది. మూయి నోరు. మీాకు ప్రహారణములు గావలశి యున్నవి. వళ్లు తీపెక్కినదిగాబోలు.

(ఏ అనుబంధము)

జహ్ను—కుమారా! పుండలీకా. లేక లేక మాకడుపున నొకడు పుట్టి నందుకు తలితండ్రులకింత విపరీతముగ మాటలాడి యెంతపు ణ్యమును సంపాదించితివిరా నాయనా!

సత్య—తండ్రీ పుండలీకా! తలితండ్రులన్న దైవస్వరూపులుగదా. వార లకన్న దైవమింకొకరు గలరా. కుమారా! యెన్ని నోము లనోచియా నినుగన్నందుల కెంతటి పుణ్యాత్ముండైతివిరా. హా! మేమెంతటి నిర్భాగ్యులము. నిన్నునట ప్రయోజనము లేదు. దైవమెంతదాక నట్టి వ్యసనము ననుభవించి మమ్ముల నేల బ్రతికించి నాశో తెలియకున్నది. పుండలీకా! పుండలీకా!

(6 అనుబంధము.)

కుమారా! మాయందు నీకతిమానముగ నున్నచో నీభార్యతో కాపుర మీడ్వలేవు సుమా. దీని మాటలకు వలపడి మమ్ముల నేల బాధించెదవు. తనయా! నీనుండిగదా మాకుసద్గతి గలుగవలె. మేము నీకంత కొరగాని వారమైతిమా. యేల యింతటి నిర్దయాళుత్వము గలిగె. మంచి వంశమున జన్మించినాడవే. ఆహా! నా దేహముదగ్ధమౌచున్నది. నాకడుపు కుమిళ్లుచున్నది. నామనస్సు నొప్పి జెందుచున్నది, కనుగన్నతండ్రీ! మమ్ముల దుర్గతులపాలుజేసి నీవు నరకము నొందకుము. దీని మాటలు వినకుము. ఇది నీకు భార్యగాదు. మృత్యువు. దీనికై మమ్ముల దూరముజేసికొనకుము. మముదూరకుము. హింసింపకుము. నొప్పింపకుము. ఇప్పటి కాలమున నిట్టివారలే ఎక్కువున్నారు. నాయనా!

సీ॥ ఇంటజేరిననాడె ♦ వెంటనే మగనితో
జేసి చాడీలను ♦ చెప్పుచుండు
అత్తమామల కెద్ది ♦ హర్షమొదవునట్లు
పనులేమి సేయక ♦ పరుగుచుండు
అతిథి యభ్యాగతు ♦ లరుదెంచ మనమున
విసుగుజెందుచు నొక్క ♦ కసరుచుండు
తనమాట నడకున్న ♦ ధవునితో బిగుసుగ
మాటలాడక వేగ ♦ మసలుచుండు

గీ॥ పనులుమానియుపరులతో ♦ బలుకుచుండు
తగనివారల నెల్లను ♦ తగు నటంచు
మించి పెత్తనములు జేయ ♦ మేలటంచు
ఇట్టి వారలచర్యలగ ♦ హితమటంచు॥

(7 అనుబంధము)

జఖా—చూచితిరా మీరుండియు నన్ను నరాని మాటలనిపించు చున్నారే. ఇదంతయు నామీద గ్రంధమే. దీని నోరున కేమైన అడ్డమున్నదా. యెన్ని నీతులు చెప్పుచున్నదో వింటిరిగదా మీరిట్లనుపించుట న్యాయమా. మీరును వారి వారలేగదా ఔను! చేతగాని వానికి చేష్టలు మెండన్నట్లు తెలసి తెలసినే నేచెడితిని. ఏమో పాడతునని మేకపోతుగంభీరములు బల్కిన నేను నమ్మితిని గాని, అబ్బా నీవేమి సామాన్యుండవా. అందులోదేగా ఈ పిడతకిసిమాటముగింతుము. నీసొగసులు నీ వలపులు నాకేమి తెలియనివిగావు. ఇప్పటి స్త్రీ స్వాతంత్ర్యపు కాలములో మగవారలగతి ఏమగునది తెలియకున్నావుకాబోలు. నేజెప్పినదేమి. నీవుచేయునదేమి.

పుండ—కాదే! వారలు చెప్పునదేదియో చెప్పనిమ్ము.

జఖా—ఓహో హో వారిమాటలు శాగావిని వారలకు లొగ్గి నన్నొక బైరాగినిగా జేతునను కొన్నావు గాబోలు. నేను విడుచుదాననుగాను సుమా. నా పెండ్లినాడు పెట్టిన బంగారు నగలు స్త్రీధనం క్రింద నాకే జెందినవి. కాని ఇంతటితో ముగిసెనా. ఈ ఇల్లు నా పేరనైన. మరిపంటతోట, ప్రాజెక్టు కాల్వక్రింద గల రెండున్నర యకరాల మాగాణి తక్షణము రిజిష్టర్ చేసియిమ్ము. ఇకసెలవు నాకు గిట్టుట తొందరే.

పుండ—ఏమిటి యొడమకంత తొందర. నేవాశ్రిత ఇవ్వకుంటేమాత్రము ఇదంతా నీదిగాదా, భాగం పంచుకొవెందులకు.

జఖా—నీకును నీతలితండ్రులకును గ్రామానికి దక్షిణ వైపునగల విశాలపు భూమిని విడచితిని, దానినిమీరే అనుభవించండి. అందులో నేనేమైన నడిగితినా.

పుండ—ఇదంతా నీవెప్పుడు కనుకొన్నావే.

జఖా—ఓహో! నీవు చెప్పకున్న నాకు తెలియదనుకున్నావేమో. వైగ్గాల్లు లేవా, స్కెచ్చీలు లేవా. గ్రామస్తుల ఆడంగులు లేవా. నాకు చనువురాదా.

పుండ—యెప్పుడు చూచావే బాగా సవరించినావు. నసుకు సమృద్ధిగానే యున్నది సుమా.

జఖా—ఇంక మాటలతో పనిలేదు. నే జెప్పినట్లు జేసి నన్ను నాకట్లుకో. నేనడిగినట్లు ఒప్పుకోని వారలనైనా యీడ్చుకో. యేదో వకటి తేల్చు.

పుండ—ప్రియసీ! నిన్ను వీడన్యాసుమా. లోకము మెచ్చునా? ఆత్మ సమ్మతించునా? కానిమ్ము ఓ ముదుసలులారా! లెండు లెండు మాయింటిలో నుండకుడు. ఈడ్చివేసెద. (ఈడ్చుట)

జహ్ను—ఔరా! పుండలీకా! ఈ యిల్లు నేను సంపాదించినదికాదా? నీవెవరివల్ల పుట్టితివో? యెవరివల్ల పెరిగితివో? వారినాయింటి నుంచి గెంటుట, నీవింతటి కఠినుడవౌదువని తలంపనైతి. సరే కొట్టుము. చంపుము. నీచేతిలో చచ్చుట మాకు పుణ్యమే తప్పదు.

సత్య—తండ్రీ! యెంతటిదుర్మార్గుడవైతివిరా. మాతండ్రిని చంపుటకు ముందు నను జంపి మాతండ్రిపాదముల యొద్ద బడవైచుము.

(8 అనుబంధము)

పుండ—రండి రండి మీరీకొంపలో నుండకుడు.

జఖా—నాథా! వీరలను పూరకె ఈడ్చెదరు. ఇదో ఈచీపురు కట్టతో మోదుడు. చంపకుడు. వీరి శ్రద్ధా లెవరు పడుతారు. పండలేక నే యవస్థపడెదా. నాచేతగాదు.

పుండ—ఓముసలిపీనుగులారా! రండి రండి. (తోయును)





శ్రీ

# భక్తపుండలీక.

## ద్వితీయాంకము.



### —♦ నళినిగృహము. ♦—

(పుండలీకుడు మంచముపై పండుకొని శిగరెటు త్రాగుచుండును.)

నళిని— (9 అనుబంధము)

పుండ—కామినీ! ఆనాడు నటించిన శృంగార విలాసములోని నృత్యమును మరొకసారి జూపింపుము.

నళి— ఓహో! ఈనాడు నాట్యము జూడనిశ్చయించితిరా! కానిండు. ఆనాడు కంసాలియింటిలో కాసుల పేరు చేయించుచున్నానని యంటిరే. నామెడ చిన్నబోయినది. తాము గమనించియే యుందురు.

పుండ— ఔనౌను ఇక రెండురోజులాలస్యము. నీకొరకయ్యేగదా అది తయారౌనది.

నళి— చిత్తము. చెప్పినమాటలు జరిగినచాలును.

పుండ— ఏదీ నీ నాట్యము కానిమ్ము. చూతము.

(డ్యాన్సు)

నళి—— (10 అనుబంధము)

పుండ——శెభాస్! శభాస్! ఈశృంగారనాట్యమెందునను నేజూడలేదు కాని ఇదెవరికిని సాధ్యముగాదు. రంభాదిఅప్సరసులంతలలొం చవలసినదే. ఉమాపతి మణిభక్తిష్టుగావలసినదే. శ్రీహరి పరుగెత్తవలసినదే. యోగులు మనోవికలులై పరితపింపవలసినదే. ఆహా! ఏదీ నాకైపు కషాయమును ఇమ్ము దానిని సేవించి నగాని ఆనందము కనబడదు.

నళి——(ఇచ్చుచు) మనోహరా! ఇట్టి చక్కలకెల్ల ఈ కషాయమే ప్రధానమైనది. దేవతలుగూడ దీనినే గ్రహించి మిగుల సంతోషమందినారు.

పుండ——కనుకనే నేను మానలేదుగా?

(సంబంధం ప్రవేశం.)

పుండ——ఓరీ సంబంధం! ఇంతదాక నీఅక్కగారును నేనునుబహువుకుశాలుగా నృత్యమును సల్పి విలాసముగా మెలింగితిమి. నీవెందులకు రాలేదు.

సంభం——బావగారూ! నేని మిమ్ముచూచుట మానుకుంటిని. లేక లేక ఒక చొక్కా పట్టించమన్న పలుకక నూరకైతిరి. చేశిన చాకిరినైన గుర్తెరుంగక పోతిరి. సోడాలు, ఫలహారాలు, బాగించి సీసాలు, కిళ్లీలు, సోపులు మున్నగునవి మీరేతెచ్చుకున్నటిరి గాబోలు.

నళి——ఓరీ సంబంధం! మీ బావ మాటలు నిజమనినామే తెలంచితివా?

సంభం——నాకనభవముగా లేదమ్మా.

పుండ——శస్వీ! యేమిట్లనెదవు. అడిగినవన్నియు నెరవేరక దీరవు. తొందరపడిన అగునా?

నళి—అయ్యా! మిమ్ముల నుత్తొందరించలేదే. మీమాటలు మీకు జ్ఞాపకముగల్గునట్లు సూచించెద.

పుండ—ప్రియసీ!

కం॥ మగువకు జెప్పిన వన్నియు
తగినటు నెరవేరకున్న ♦ ధర పురుషునకున్
రగడలు గలుగక మానవు
వగపున్నిరతంబు సర్వ్వవ ♦ స్థలు నొందవున్॥
గాన నీకోర్కెలు నెరవేర్పక తప్పను.

నళి—ప్రియా! తామీరీతి మనంబున తలంచుకొన్న చాలును.

సంబం—కాదే అక్కా! ఇలాంటి వారలు మనయింట నెందరు లేరు. పాతకాతా తీసి జూపుమనా?

నళి—ఓరే! నీకు మర్యాద లేదు. మట్టులేదు. యేసమయమున నెట్లు నటింప వలయునో గుర్తెరుంగవు

సంబం— (11 అనుబంధము.)

పుండ—ఏమి నళినీ! వీడేమి నన్ను చిన్నగా జూచుచున్నాడు.

నళి—వాడు అమాయకుడు లెండి.

పుండ—ఔను మనమిద్దరము సరస సల్లాపములు సల్పుకొనుచుండ వీ డొకడడ్డముగా వచ్చుచున్నాడే.

నళి—ఇట్లాంటివారలు మాయిండ్లలో నుండవలసినదే. వీరిచేత నేమా వ్యాపారం హెచ్చుగును. మీ వంటి వారలపను లెల్ల నెరవేరును.

పుండ—వీడు మగవాడుగదా.

నళి—ఔను అయినను మాకు సహాయించు బాధ్యత వీనికే గలదు.

పుండ—సరే సరే నిద్రవచ్చుచున్నది. ఏదీ ఆనాటి విలాసములోనిజావళీ నొకటి పాడుము.

నళి— (12అనుబంధము)

పుండ—భేష్ భేష్

నళి—మనోహరా! చాలారోజులనుండి మీతోడ తమాషగా జూదమాడవలయునని కోరికయున్నది.

పుండ—కానిమ్ము నీకోరికే నాకోరిక, రా కూర్చొనుము. అయితే నీవు నాతోడ పైకూర్చుంటే నేఆడ్తా.

నళి—మీరేంపందెం పెడుతారు.

సంభం—అమ్మాయి! ముందునీవేం పెడ్తావో చెప్పు తర్వాత బావగారు చెప్తారు.

నళి—నేనా ఒంటిమీదినగలు ఇంటిలోను వెండి బంగారు సామాన్లు పెడతా.

సంభం—బావగారూ! మీరో

పుండ—నేను మాత్రము: ఇల్లు, పొలము, ఇంటిలోనిసామానులు, ఒంటిమీదనగలు పెడుతా

సంభం—అయితే సిద్ధంగా వుండండి. ఊఁ, ప్రారంభించండి. ఒకటి, రెండు, మూడు.

నళి—ఆ. ఆ. ఆగు ఆగు గెలుపునాదే.

(తలుపుశబ్దమగును)

పుండ—ఓమే నళినీ! యెక్కడదీశబ్దము. నాభార్యగొంతువలెనున్నదే ఆ ల్వెమ్మయో? దీనిబారితప్పించుకొను టెట్లు, నన్ను గొంతుపిసికి నైచును.

( జ ఘా భా యి ప్రవేశం )

జఘా——ఓరీ దుర్మార్గా ఈమిటుకులాడి వలలోజిక్కి రోజు కోజునన్నెంటరిగా ఇంట్లోవిడచి నీయిచ్చ వచ్చినట్లుఆట్లాడెదవా. నాకుతెలియదనుకున్నావుగాబోలు. దీనివలపులకులొగ్గికులుకుచున్నాడవా, కట్టుకున్న పెండ్లామన్న నింతచులకనయా, మట్టుమర్యాదలు లేక వెలయాలిఇంట్లోజేరి వెంగిలిముంగిళ్లనాట్యమాడెదవా. లెమ్ము మారాడకనా వెంట ఇంటికిరమ్ము.

సఖి——ఏమేగయ్యాళీ నీమగనిని నీయిష్టమువచ్చినట్లుయేమైననుయనుకొనుము, నన్ననదవేల. ఇతనిని నీఇంటికి తోడ్కొని పోగలవా, నీఇల్లేమిటి, వాకిలేమిటి ఇదిగో జూడుము నీమగడుజూదమున ఓడిపోయిన వస్తువులజాబితా. (ఇచ్చును)

జఘా——(చూచి) అమ్మా నాకేమియు అర్థముగాలేదు.

సఖి——యెట్లగును. వినుము చేతికడియం.

సంబం——చెవికుండలాలు.

సఖి——పాత్రసామాగ్రి.

సంబం——మిరపతోట.

సఖి——పాత్రెజెట్టుకాల్వకిర్రిందగల రెండుస్సరయుకరా మాగాణి.

సంబం——ఇల్లు.

సఖి——విన్నావా! ఈక్షణమునుండి ఇల్లు, పొలం, సామగ్రి అంతయునాది. పూరకెవాగెదవా! వెనుకముందులుజూడక గంతులు వేసెదవా. నోరులేనిమగనిని యేడిపించునట్లుగాదునునూ. ఇతనునాయాజ్ఞలేనిది వెళ్లుటకువీలులేదు. మీరినడచిన నిన్ను ఈపిరికిపీనుగను ఇద్దరిని కట్టవేసి మీచర్మముల నొలిపిస్తా.

జఘా——ఆ, ఆ, ఓరీ పందపీనుగా! యేం మాట్లాడకూరకున్నావు. నిజంగాదీనికి ఓడినావా, అతమిదిసికేక్స్వార్పణము, చెప్పుము,

పుండ—అది చెప్పిన దంతయు వాస్తవమే. నీవ్వూరకుండవ్వు, ప్రాణాలతో మనలనిద్దరిని విడచితే చాలు. యేలాగో బ్రతుక్కొనవచ్చు.

నళి—సంబంధం! వీరలిద్దరిని మెడబట్టితోయుము. యేంచూస్తావు. ఆలస్యము సేయకు.

పుండ—నళినీ! యేమింత అన్యాయము జేసితివి. నన్ను మోసము జేయుట ధర్మమా? ప్రియసీ!

చం॥ పరతమునిన్ననమ్మి మది ♦ నిశ్చలభావముతో జనంతయుత్వరితముగానొసంగితిని ♦ తద్దయుదిక్కునీవటంచు నే
సరిగనటించినాడఇటు ♦ చాలునుదప్పి వచింపధర్మమే
తగుణిరోనీకిదిసిరమె ♦ ధర్మము దేవుడెఱుంగకుండునే॥

నళి—ఓరీ ఊ ఊ (సైగజేయును) నీకు దేవుడొకటియా

సంబం— (తోయును.)

( మల్లిగాడు—పుల్లిగాడు ప్రవేశం )

మల్లి—ఓరీపుల్లిగా! పుండలీకుడు తల్లితండ్రులను గొట్టి బాధించినందులక నుభవించినాడు చూచినావా.

పుల్లి—ఏమనుభవించినాడురా! గయ్యాళిపెండ్లాము, గడ్డము, తల, నరసినతలిదండ్రులు.

మల్లి—అదిగాదురా! మనవూళ్లో వున్న మాయలమారియగు నళినిసహవాసంజేసి, వున్న సర్వస్వమును ఆమెకు ధారపోశినాడట.

పుల్లి—ఆమె నుండి యెందరుజెడిరి రా రామాశాస్త్రి, అనంతాచార్లు, భంగిశెట్టి, గంగిరెడ్డి, కాదర్ ఖాన్, జహంగీర్ వీరలందరు ఒకే భంగిమతంలో జేరి కలసి తాండవమాడుచున్నారు.

మల్లి—పాపము! పుండలీకునిగతి ఇక్లేఅయినది.

పుల్లి—కుమారుని బాధలకు తాళలేక తలితండ్రులగు ముసలివాళ్లు కాశీయాత్రె సేయుటకు వెళ్లిరట.

మల్లి—వారలు పుణ్యాత్ములనే? ఈ పుండలీకునికిమాత్రం నరకము తప్పదురా.

పుల్లి—అట్లనవద్దురా అతడేమిసామాన్యుడా? బాగుగాచదువుకొన్నవాడు, నీతిపరుడు, మాటతప్పని వాడు, సాధువు, అందులో సద్బ్రాహ్మణుడు.

మల్లి—అట్టివాడిట్లెందుకయ్యె.

పుల్లి—అంతయు ప్రారబ్ధకర్మ.

మల్లి—ఒరే!పుల్లిగా ఇందరినిజెరపి సంపాదించిన నళినిని,ఆ స్త్రీ దండిగాకూడబెట్టి బాగాయున్నదనుకుంటాను.

పుల్లి—పిచ్చివాడా! అదిజెడిన తర్వాత దానికిబిచ్చము వేయువారుకూడ యుండరు.

మల్లి—చాలురా నాయనా! వెలయాలిహితము.

( 13 అనుబంధము )

వద్దురా! వద్దురా! యెందరో జెడినారు, పాడైనారు, కుళ్లినారు, నరకమునబడి పరితపించుచున్నారు. ఆనళిని యెక్కడికో వెళ్లుచున్నట్లున్నది. దాని దర్శనము మనకు వద్దురో, పోదాము పద. (నిష్క్రమింతురు)

( నళినీ ప్రవేశం )

నళి— ( 14 అనుబంధము )

ఆహా! యేమి నాచరిత్ర ప్రభావము.

సీ॥ క్షణములో కనుసైగ ♦ సలిపినంత నెత్వరగ
పద్మనాభుడు యెల్ల ♦ వ్రాసియిచ్చె
ఒకసారిచిరునవ్వు ♦ నొసగి వద్దను నిలువ
బూచి రంగడు యెల్ల ♦ దోచియిచ్చె
నిముసమాత్రము హాయల్ ♦ నీటుగ నలుపంగ
రంగిశెట్టియు సొమ్ము ♦ లొసంగియిచ్చె
భుజముపై చేవైచి పోలు ♦ పారణనివిన
దామోదరుడు పెక్కు ♦ ధనమునిచ్చె

సీ॥ సరస సల్లాపములతోడ ♦ సౌఖ్యమొసగి
చక్కగా నమ్మకముగల్గి ♦ నిక్కముగను
నీతినిర్ణ జూపివర్తింప ♦ నిజమునరసి
పుండలీకుండు నను జేర ♦ బెండుబడియె ॥

ఇదియే నాచరిత్ర నను సోకినవారలు, దాకినవారలు, చేరినవారలు, మాటాడినవారలు, ఆదరించినవారలు అందరునో కేగీత పాడక మానరు. యెవరును కడ తేరలేరు. ప్రారాగులైన వారు కొందరు. విరాగులైనవారుకొందరు. దేశద్రోహులైనవారుకొందరు. పిచ్చివారలుకొందరు. కాని ప్రతినిముసమునకు దేశమున నను తలంపనివా రేయుండరు. స్త్రీస్వాతంత్ర్యప్రతిభకు, నే నొకతెనే చాలును. నాకీర్తి జగంబంతయు ప్రాకి యున్నది. పుండలీకుడు బ్రాహ్మణైనను మహా దుర్మార్గుడు. తలితండ్రులను కొట్టి తిట్టి నానాహింసలుబెట్టిన పాపాత్ముడు. వాని గతిఇట్లైనను మాత్రము మనస్సు మార్పగలైనా. కాదు, కాదు. ఇతని బాధలకు తాళలేక వృద్ధులగు తలితండ్రులు కాశీకి వెళ్లిరని వింటిని. కాని పుండలీకుడుకూడ గయ్యాళిభార్యతో కాశికి వెళ్లి బ్రతుక నిశ్చయించు కొన్నట్లు తెలియుచున్నది. ఈ పాపి ఆ గంగలో మునిగిన గంగ ఇమిరిపోవకనుండదు. వీనిపాపములు ఆమెను బాధింపక విడువవు. యేమగునో చూచెదగాక. (నిష్క్రమించును) (తెరబడును)

(పుండలీకుడు_జఖాబాయి ప్రవేశం)

పుండ—తన్వీ! ఇక నుండియైన మంచిగా మాటలాడుము. ప్రేమమున నుండుము. శాంతముగవర్తింపుము. వీను అనేకులు కాశీయాత్రకై వెళ్లుచున్నారు. మనముచటికి వెళ్లి అందెట్లో బ్రతుకుదము రమ్ము.

జఖా——నేను నడువలేను నాచేతగాదు. నీవేకాశికి వెళ్లి గంగలో మునిగిచావుము.

పుండ——ఏమే! నేనొకడనే వెళ్లిన నీగతియేమి. నీవీదారిలో నెట్లుందువు. యెవరు పలుకరింతురు. యెవరి నాశ్రయింతువు.

జఖా——నాయిష్టము! ఈ సమీపమునందుగల పల్లెలోజేరి యేగృహస్థుని యింట్లోనైన వంటలు జేసియో, లేక నీళ్లు మోసియో, తుదకు బానిసగా నుండియో బ్రతికెద.

పుండ——యెంతటి ధైర్యమే! యేమి సాహసమే! నాకట్టి సమర్థత గల్గుట లేదు.

జఖా——పురుషులకు ధైర్యము, స్వాతంత్రియము, శూరత్వము, గంభీరము నుండుకాలము గడచినది.

పుండ——ఔనౌను! అందులకే ఇట్టి గతులు గల్గినవి. నీకిట్లునోరాడించునది. కాని వూరకె గంతులు వేయకు. అదో ఆ కనుబడునదే త్రివేణీసంగమము. అందే గంగా యమునా సరస్వతులొకే చోట కలసియుండు పావనక్షేత్రము. అందున జేరితే అనేకాశ్రమములున్నవి. ఈవేళ గడచిపోవును. నిధానముగనైనరమ్ము.

జఖా——నేను రాజాలను, రాలేను, రాను.

పుండ——అయితే! ఈ అధ్వాన్నపు అడవిలో కూర్చుంటానంటావా.

జఖా——నేను! నీకవసరమైతే నాయందు నీకు ప్రేమయేయుంటే, నన్ను తోడ్కొని పోవలెనని తలంచియున్నచో, నీభుజముమీదయెక్కించుకొని తీసుకపో.

పుండ——హరి హరీ! యెంత అవస్థవచ్చె. సరే కూర్చొనుము. దేవుడా! నే జేసిన కర్మ నాకు న్యాను భవమగుచున్నది. చాలు చాలు ఈసంసారము. ఏమే, ఏమే, కదలవద్దు, ఊరకెకూర్చొనుము.

నీబిగింపునకు నాకతికె నల్లుచున్నది. పరమాత్మా! అపరాధి ని క్షమింపుము. రక్షింపుము.

(15 అనుబంధము)

జఖా — ఓహోహో! ఈ వేళ స్మశానవైరాగ్యము గలిగినదే.

పుండ — కాదే! మగనిని మోసుకపోవునిన భార్య యెందైననుగలదే? ఇట్టి కర్మ మెవరనుభవింపరు. నన్ను గురించి నేనే వైరాగ్యము ను నిశ్చయించు కొనుచున్నాడను.

జఖా — అబ్బబ్బా! నా కునడుములు పట్టుకొనినవి. దించండి, దించండి. నేనూరొచ్చనలేను. రాలేను. ఈ స్థలముననే పరుండెద. నీవెచ్చ టికైనా వెళ్లి అన్న మెటిసికొని రమ్ము నిద్రపోతా. (పరుండును)

పుండ — అకటా! దైవమా.

గీ॥ తెలసి తెలియక నెన్నియో ♦ వేల కొలది
తప్పితంబులు సల్పితి ♦ దయగాంచి
బ్రోచి ఈ సెకు నాపయి ♦ ముదము, దయను
ఇచ్చి శ్రీహరి గాపాడు ♦ మచ్చికలర॥

(15 అనుబంధము)

తాళజాల, తాళజాల, ఇట్టి కర్కసిని నాయుడకెట్లు గట్టిరో తె లియకున్నది. కనికరమా శూన్యము. ప్రేమ యేమాలేదు. సం తోషమా అదృశ్యము. ఇట్టిజన్మ నాకొరకై బ్రహ్మదేవుడుసృ ష్టించియున్నాడు. లేరా యెందరుఆడవారలు? లేరా మావంటి కుటుంబినులు. ఇంతి అన్యాయమా? నోరు చూతెమా ఫక్కె, ముఖము జూతెమా కర్కసి, మనసు జూతెమా పాషాణము,

అబ్బా? నిప్పును ప్రక్కన నిడుకొని నిదురించురీతియైనది. వలదు వలదు ఈసంసారమేవలదు. త్వరలో నా దేహమును విడ జేయుము. నా ప్రాణములందుకొనుము. కృష్ణా! నేను మహాపాపిని, ఈరక్కసి మాటలనువిని తలితండ్రులను మిక్కిలిగ బాధించిన దుష్టుడను, కఠినుడను. నన్ను భువిపై జీవింపజేసిన వారిని ననుభవింప గలవారెవ్వరైన నుందురేమో, ఇట్టి అవినీతి నిముందు ప్రసరింపజేయకుము. చాలు చాలు నేజేసిన తప్పిత ములను నే గుర్తెరింగితిని. స్వయంకృతాపరాధమని నమ్మితిని. ఇదంతయు నీమాయయేకాని నీవు నను పరీక్షించుచు నేయున్నాడవు. దేవాదిదేవా! నాపై వైరము మానుము. ద్వేషము జూపకుము. కనికరింపుము. నిదాసుడను.

(గంగ యమున సరస్వతులు ప్రవేశము)

(17 అనుబంధము)

గంగ—ఓరీ! పుండలికా

యమున—ఓరీ! ద్విపాదపశువా

సర—ఓరీ! మాతా పితృద్రోహీ

పుండ—(లేచి కన్నులు నులుపుకొని) ఓరక్కసులారా! మీరెందునుండి వచ్చితిరి, నను భక్షింపుడు. యీ సంసారబాధ నేభరింప జాల. (యోచించును)

గంగ—ఓరీమూఢా! మేము రక్కసులము గాము, నీబోటిపాపాత్ముల ను పునీతులను జేయు మహానదులము. లోకైక ఘోరపాతకివగు నీగాలి సోకుటచే మాకు యీ భయంకర వికృతరూపము లు గల్గినవి. ఇందులకు సమీపమున కుక్కుటస్వామిగలడు.

ఆయువను దర్శించి మా వికృతరూపములను బాపుకొనెదము.

యము—ఓసీమూర్ఖా! యెంతటి సద్భాగ్యుడవురా. తలితండ్రులను బాధింప దగునా. దైవ స్వరూపులు గారా.

సర—అయ్యో! ముసలివారలే వారలను గొట్టుటకు ద్రోయుటకు నీకు చేతు లెట్లాడెను. ద్రోహీ! ఇప్పటికైనను బుద్ధి తెచ్చుకొని మాతోకూడావచ్చి కుక్కుటస్వామిని దర్శించి జన్మ తరింపజేసికొని పాపరహితుడవుగమ్ము.

పుండ—తల్లులారా! మీదర్శనముచే ధన్యుడనైతిని. మీరే నన్ను కుక్కుటస్వామిని దర్శింపజేసి పునీతుని జేయ వేడెదను.

గంగ—రమ్ము! రమ్ము! మేము బోయెదము. నీవు నీ భార్యతో నిదానముగ రమ్ము. అందు కనబడునదే ఆశ్రమము. మేమచట నుందుము. (నిష్క్రమించును)

పుండ—(భార్యను సమీపించి) ఏమే! లెమ్ము. ఆసమీపమున నొక ఆశ్రమ మున్నది. అచటికి బోదము రమ్ము. తమాషా చూపించెదను.

జఖా—తమాషా లేదు నీతలకాయ లేదు. బంగారము వంటి నిద్రను బోగొట్టుకొని నేను రానుపో.

పుండ—అట్లయిన నేనొకడనే పోవనా? నిదానముగ నైనా నీవురమ్ము.

జఖా—మంచిది. నీకు కైపు తల కెక్కినది దించెదను. కాస్త, జూతము పోమ్ము.

పుండ— (నిష్క్రమించును) (తెరబడును)





# భక్తపుండలీక.



## తృతీయాంకము.

---

(కుక్కుటాశ్రమము)

[తలిదండ్రుల సేవ సల్పుచుండును.]

గంగ—ఓ పుణ్యపురుషా! రక్షమాం, రక్షమాం.

యమ—హేలోకైక మాతాపితృసేవాధురీణా పాహిమాం.

సర—ఓ కుక్కుట స్వామీ! నమస్కృతులు.

కుక్కు—(నమస్కరించి) ఓ గంగా! యమునా! సరస్వతులారా! వందనసహస్రములు. మీరు వచ్చిన పని నేనెరుంగుదును. మీ దర్శనముచే ధన్యులమైతిని. నాజన్మ తరించెను.

(18 అనుబంధం)

గంగ—మహాపురుషా! నీవు లోకపావనుడవు. నీవాచర్చిన మాతాపితృసేవయు, అతిథి అభ్యాగతుల ఆదరణయు ప్రపంచమున సహస్రకోటి ప్రభాభాసమానమగు కాంతితో నీకీర్తి వెలుంగుచున్నది. స్వామీ! మమ్ములను ఈ వికృతరూపములను తొలగింప జేయుము.

కుక్కు—తల్లులారా! మాతలిదండ్రుల యాజ్ఞచే మీ వికృతరూపము

వెల్లి తొలగించితివి. (పూలుజల్లును) సంతోషము. మా యింటిలో ఈ పూట నిలువంబడి ఆదరమున నాతిథ్యమును గైకొని పొండి.

(ప్రవేశం పుండలీకుడు.)

పుండ——మహాత్మా! కుక్కుటస్వామీ! రక్షింపుము, రక్షింపుము.

కుక్కు——ఓయీ పుండలీకా! ఏలవచ్చితివి?

పుండ——మహాపురుషా! ఇక్కడికి కాశి యెంతదూరమున్నదో తెలసు కొందమని వచ్చితిని.

గంగ——లోకపావనా! కుక్కుటస్వామీ! వీడు మహాపాపి. వీనికి దివ్య జ్ఞానమొసంగి పాపరహితునిగా జేయుము. మేము పోయి వత్తుము. సెలవిమ్ము. (నిష్క్రమించుట)

కుక్కు——నాయనా! పుండలీకా!! కాశి యెందున్నది తెలియదు. నే నెన్నడు కాశికి వెళ్లలేదు. చూడలేదు.

పుండ——ఏమీ? ఏమీ? యోగీంద్రా! కాశీయాత్ర, గంగాస్నానం, అన్న పూర్ణావిశ్వేశ్వర సందర్శనము చేయకయే ఇంతటి మహి మ గలవాడవైతివా? ఎట్లు సంపాదించితివి?

కుక్కు——ఓయీ వెర్రివాడా!

(19 అనుబంధం)

పుండ——(నమస్కరించి) హా పాపిని, హంతకుడను. కృతఘ్నుడను. అధ మాధముడను. రక్షింపుము, రక్షింపుము.

కుక్కు——నాయనా! పుండలీకా! దుఃఖింపకుము. అజ్ఞానమున జేసిన పాపములు తొలంగెను. నీకు జ్ఞానోదయమైనది. పొమ్ము. నీ తలిదండ్రులకు సేవ సల్పి కృతార్థుడవుగుమ్ము.

పుండ——(పాదములపైబడి) మహాత్మా! నాతలిదండ్రులెందున్నారు? నా దైవము లెందు వసించినారు. అమోఘ సిద్ధాభాగ్యుడను. వారి

దర్శనము నాకు గలుగునా? వారిసేవ నాకబ్బునా? వారిదయ నాకుప్రాప్తించునా? వారి సంతోషము నేజూతునా స్వామీ! ఇంకెక్కడి తలిదండ్రులు. ఈ పరమఘాతకుని బాధలు సహింపలేక యేవాగినబడి మృతించిరో. యేవిధమున దుఃఖించిరో. యెంతటి బాధలొందిరో. యేమయిరో తెలియదు. ఛీ, ఛీ, ఇట్టి కృతఘ్నుడేల బ్రతుకవలయునో (కన్నీరువిడుచుచు) పరమపావనా! త్వరలో నన్నీభువినుండి తొలగింపరాదా? ఏలయుండవలె యెవరినుద్ధరింపవలె. యేమొనర్పవలె. చాలింపుము. ఈతనువు మహానరకపూరితమైనది. ఈ ప్రాణి కడు నీచముగ వర్తించినది. వలదు, వలదు, ఇంకేమియువలదు.

కృష్ణ—పుండలీకా! యేమింత వెర్రిలోబడితివి. నీవు మిగుల పుణ్యాత్ముండవు. నీసేవకై, నీసంతోషమునకై, నీధన్యతకై నీకన్న ముందుగా నాయాశ్రమమున నీతలితండ్రులుజేరి సుఖముగా నున్నారు రమ్ము జూపెదను.

పుండ—స్వామీ! హాస్యమునకది యే సమయమా?

కృష్ణ—పుండలీకా! నిక్కము, నిక్కము. నీతలితండ్రుల దర్శనభాగ్యము గల్గింతును రమ్ము. (నిష్క్రమించుట)

(తెరబడును.)

[ జహ్ను - సత్యా భజన సేయుచుందురు ]

(20 అనుబంధము)

[ ప్రవేశం పుండలీకుడు. ]

పుండ—(పాదములపైబడి) తలితండ్రులారా! ఈ అపరాధిని రక్షింపుడు. ఈ ద్రోహిని ప్రేమింపుడు.

(21 అనుబంధము)

సత్య—నాయనా! కుమారా! రా రా నాబంగారు తండ్రీ! నిన్ను చూచు

భాగ్యము గలుగునని కలనైనన తలంపలేదు. అనాథలమై అడ
వులపాలై, అతియవసల ననుభవించుచూ యెట్లో ఈ మహా
త్ముని ఆశ్రమము జేరితిమి. పుండలీకా! ఇప్పటికైనను నీభా
ర్య దారికి రాగలైనదా.

జహ్ను—కుమారా! పుండలీకా! రా రా నాప్రాణమా. ఒక్కసారి
నీయొడలు నాయొడలికి చేర్చి బ్రహ్మానందము నొసంగరా.

పుండ—తలితండ్రులారా! క్షమింపుడు. రక్షింపుడు.

సీ॥ నవమాసములు మోసి ♦ నను గన్న తల్లిరో
ఇన్నాళ్లు నిన్ను సే ♦ వింపనైతి
నను బెంచి పెద్దనో ♦ నర్చిన నాతండ్రి
ఇన్నాళ్లు నిన్ను భ ♦ జింపనైతి
ఈసడించితి ధిక్క ♦ రించి తిట్టితి
కొట్టితి క్రోధించి ♦ కోతలిడితి
పాపినౌ ననుసోక ♦ పచ్చని చెట్లెల్ల
ఆకులూడిచి యెండ ♦ మాడ్కులవును
గీ॥ అట్టినన్ను క్షమించితి ♦ రాదరమున
మీదయాసాగరమునకు ♦ మేరగలదే
రంచి మీయొడి నన్ను ♦ కూర్చుండనిచ్చి
యెల్లజగముల మాకీర్తి ♦ నొడ్వనిండు ॥

హా! తల్లితండ్రులారా! నేనొనర్చిన బాధలకు మీరెంతగ విల
పించితిరో. యెంతగ పరితపించితిరో, యేగతినటించితిరో. అ
కటా! యెంతటి దుర్మార్గుడనైతిని. యెంతటి పాపినైతిని. క్ష
మింపుడు. నిశ్చలమనస్సున నను ఆదరమున కృతార్థుని సేయుడు.

సత్య—పుండలీకా! ఇంకేల పరితపించెదవు. "పశ్చాత్తాపేనశుద్ధ్యతి" అ
నురీతి నీకుకుక్కుటస్వామి దర్శనముచే దివ్యజ్ఞానముగల్గి నీకెపుడు

పశ్చాత్తాపము గలిగెనో అప్పుడే నీసర్వపాపములు నశించి నవి. ధన్యుడతివి.

(22 అనుబంధము)

జహ్ను—కుమారా! నిజముగా నీవుధన్యుండవు నీతో సేవ జేయించు కొను భాగ్యము నేటికి గలిగెను. నీవు కృతార్థుడ వయ్యెద వు గాక.

పుండ—తలితండ్రులారా! మీసందర్శన మహిమయే ననుకృతార్థతనొం దింపవలయును. (కాళ్లగడుగును.)

( జ ఖా భా యి ప్ర వే శ ం )

జఖా—అయ్యో!అయ్యో! కథంతా అడ్డంగాతిరిగిందే. విపరీతంగామా రిందే. ఈముసలి పీనుగులిచ్చటి కెట్లువచ్చిరి. వీరికి ఈపిడత కా ళ్లగడగి పరిచర్యలు సేయుటేమిటి, యే మోపప్రిమాదం తటసిం చె. మరల నాశంతానికి ఉరివచ్చె. వీరలుబ్రితికినంతకాలం నా సంసారానికి తిప్పలే. ఏమండీ! అందరక్కడెట్లు చేరితిరి.

పుండ—తన్వీ ! మనకు మంచి రోజులు కాబట్టి అందరము ఇక్కడ జే రితిమి.

జఖా—మంచి దినములా! అవెట్లువచ్చెను. (చీపురుకట్టచేత బట్టుకొని) ఇదో చూడుము. దుర్దినములు గనబడును. (మీాద బడును)

పుండ—ఓసీ! పాపీ! నా మాతాపితృవుల పై చేయివైచితివా, నీ కండ లు తుండెములుగా జేసెద.

మ॥ ననీమాటలు వాగజాలవు సమా ♦ యిట్లైననాతోడనా
సకలంబుల్ కని జేసినట్లయినసీ ♦ సంతోషముల్ గాంచెదల్
చికలత్వంబు నటింపనీకుణము నల్ ♦ వీధింబడల్ ద్రోసెదల్
తెకరారేలవచించెదీక్షణమెనీ ♦ దాక్షిణ్యమే వద్దికల్ ॥
ఏమందువు నోరి త్తకుము, మారుమాటాడిన జెరుదువుసుమా.

సత్య—కోడలా! యేల యింతటి మూర్ఖత నేఁడు మహాసుదినము. అందరము కలసితిమి, ఆనందముగ మాతో నుండరాదేమమ్మా.

జఖా—అబ్బా! యెంతనంగనాచివే, యెంతటి తియ్యని మాటలే, మిమ్ములను పూర్వమైటకీడ్చి ఉరివేసినను దోషముగల్గదు. ఆనాడే మిమ్ములనిద్దరిని ఒక్కసారితటుక్కున గొంతునులిమియున్న మీ కింతవరకెన్ని తద్దినములు జరుగుచుండెనో. నాతప్పితమును నేనే క్షమించుకోవాలి, కాని ఓసీ! పందా! వీరలనవిడచి, నా వెంట వత్తువా, లేదా?

పుండ—ఓసీ! కిరాతకీ! నీనోరు పాడైనది. నీకు చెడుకాలముసమీపించినది. నేను రాను, నా తలిదండ్రుల పాదసేవయే నాకు జీవనము. నీవును నావలెనే అత్తమామలకు పరిచర్యలు చేసిన ఇందుండుము. లేకున్న నీయిష్టము.

జఖా—అంతేనా? నామాట నిరసించ్చవా.

పుండ—కాదు! కాదు!

జఖా—రావా! రావా! ఇక నీ ముఖము జూడను. నీకు నాకు నేటితో సంబంధము వదలును. బాగుగా యోచించుకొనుము. ముందాలోచన సేయుము. ఇదిగో? నా పుట్టినింటికి వెళ్ళుతా.

(23 అనుబంధము)

పుండ—పో! అత్తింట గిట్టనిమనిషి పుట్టింట నెట్టకమానదు. కాని? నీ కదియొకటే బాకీ యున్నది. అనుభవింతువు పో.

( జఖాబాయి నిష్క్రమించును. ) (తెరబడును)

( ధర్మమూర్తి - జఖాభాయి ప్రవేశం )

ధర్మ—అమ్మా! నీకొంపంచి వచ్చితిని. నీ మగడేల రాలేదు. నినుజూడ నామనంబున కేదియో సంశయము బొడముచున్నది.

జఖా—తండ్రీ! నామగడు నను పలుకరించను, పలుకరించని వానితో పనియేమని ఇందులకు వచ్చితిని.

ధర్మ—మూర్ఖురాలా! ఒక్క క్షణమైనా నాయింట నుండరాదు. నీవు వచ్చిన దారిన పొమ్ము.

జఖా—అనాధనై వచ్చిన కుమార్తెను ఈరీతి గా మాటలాడతగునా.

ధర్మ—చండాలిసీ! నాథుండు గలిగి యుండియు అనాథ ననెదవా? నోరు మూసి కొని పొమ్ము.

జఖా—ఎక్కడికి పోవలె తండ్రీ?

ధర్మ—దేవ బ్రాహ్మణ సన్నిధిని అగ్నిసాక్షిగ నిన్నెవడు పెండ్లాడెనో అతనియొద్దకు పొమ్ము.

జఖా—తండ్రీ! నేనేమితప్పు జేసినానని నాపై నింత కఠినముగా మాటలాడు చున్నావు.

ధర్మ—ఇంతకన్న తప్పు మరొక్కటియు లేదు. పతినివిడచి ఇక్కడికి రాగల్గుటయే.

జఖా—జనకా! ఆయనకిప్పుడు పిచ్చిపట్టినది.

ధర్మ—అట్లయిన పిచ్చిబట్టినవానిని విడచి రాగల్గుట మరొక తప్పు. ఛీ, మాట్లాడకుము.

చం॥ సతికిని భర్తభూషణము ♦ సద్గతినిచ్చు మహానుభావతా
వ తికిసమార్గదర్శకుడు ♦ మాన్యుడు మోదముగూర్చువాడగుా
జతగ మెలంగు మన్మథుడు ♦ సంతతినిచ్చు విధాతయట్టులా
వెతలనుబెట్టి నీమగని ♦ వీడి నటించుటెతప్పు పొమ్మికా॥

నీముఖము జూపకుము.

జఖా—పిచ్చి అనగా రాత్రింబగల్లు ఆతలితండ్రులకు ముసలివాళ్ల సేవ జేస్తాడు. అదేలోకమంటాడు. అదే మోక్షమంటాడు. అదే జీవనమంటాడు.

ధర్మ—లేకపోతే రాత్రింబగళ్లు నిన్ను నెత్తిమీద నెక్కించుకొని నృత్యం చేయమంటావా?

జఖా—కాదు తండ్రీ!

ధర్మ—మరేమి!

జఖా—ఇరువదినాల్గు గంటలు వారల సేవలో నేమరగితే నన్నొక నిమిషమైనా ఆదరించవద్దా?

ధర్మ—ఆదరించక నిన్నేం కొట్టాడా? లేక తిట్టాడా? అన్నం పెట్టక పస్తు పరుండ బెట్టాడా?

జఖా—అది కాదు తండ్రీ!

ధర్మ—పోనీ కట్టుకోడానికి చీరలియ్యలేదా? పెట్టుకోడానికి సొమ్ములియ్య లేదా?

జఖా—నను జెప్పనిమ్ము తండ్రీ!

ధర్మ—ఏమి జెప్పెదవు. తాను దూదిపరుపున పరుండి నిన్ను బట్టనేలపై పడుకొనమన్నాడా?

జఖా—అదిగాదు.

ధర్మ—మరి యింకేమపరాధము జేసినాడు.

జఖా—తండ్రీ! చేసుకున్నవానను నేను నన్నొకసారైన మాటాడించడు. ఎప్పుడు అప్పసనిగాళ్ల మాటవిని వారియాజ్ఞచే నడవకపోతే నాయాజ్ఞ కెందుకు నడవగూడదు?

ధర్మ—ఓసీ ము[illegible]రాలా! నీయాజ్ఞల్లో వర్తింపవలెగా? ఇదియా సంగతి. భర్తలు భార్యల ఆజ్ఞలకు బద్ధులై నడచుకొనవలెననే యీనవీన తత్వము నీకెవరు బోధించిరి? (స్వ) ఆహా! కాలమేరీతి మార్పుకలిగె. స్త్రీలకెంతటి ధైర్యము, ఎంతటి సాహసము, యెంతటి వాక్చాతుర్యము, ఎంతసహనము హారా! యెంతటి

నైనను స్త్రీలు శౌరవరుగదా? తనయాజ్ఞచే మగడు నడువవలయునను నీతి ఇపుడిపుడే ప్రపంచమంతయు నావరించుచున్నది. ఇదంతయు పురుషుల అవివేకితనము. మంచి వంశమున జన్మించి మాతాపితరుల కపకీర్తి గలిగించు ఇట్టిచండాలినులుండిననేమి? మండిననేమి?

కం॥ మగనిని విడచిన మగువలు
జగమున నెందైన తెగరు ♦ సరివారలిక॥
వగవారిరీతి జూతురు
తగునే నీబ్రతుకు వ్యర్థ ♦ తమమౌ నసుమా॥

ఘోరపాతకీ! నీముఖము జూచినను నీమాటలు వినినను నేను మహాపాపుడగుదును. పొమ్మా.

జఖా—అయ్యో! అయ్యో! తండ్రీ! నిన్నటినుండియు నిద్రాహారములు లేక కడుపు మాడుచున్నది. కన్నబిడ్డ నిట్లేల జేసెదవు.

ధర్మ—ద్రోహీ! నీవు కన్నబిడ్డవా? పతి ద్రోహమొనర్చిన పాపివి. కడుపుకాల్ప సమకట్టితివి. ఛీ మాటాడకుము. (త్రోయును)

(24 అనుబంధము.)

జఖా—తండ్రీ! క్షమింపుము. రక్షింపుము. బుద్ధివచ్చినది.

ధర్మ—అట్లైన నేజెప్పినట్లు వినెదవా? భర్తయొద్దకు వెళ్లి పాదములపై బడి వేడుకొనవలయును. ఏమందువు?

జఖా—తండ్రీ! అట్లేజేసెదను.

ధర్మ—అత్తమామల కెదురాడక వారి సపర్యలు నిరంతరము సేయవలయును.

జఖా—చేసెదను.

ధర్మ—నిక్కమేగదా?

జఖా—శ్రీహరి సాక్షిగ త్రికరణశుద్ధిగా జేసెదను.

ధర్మ—అట్లైన సంతోషము, అమ్మా! దుఃఖింపకుమా, రమ్మా.

భుజింపుము. నేను నీవెంటవచ్చి నీభర్తకును, నీఅత్తమామలకు ను నచ్చజెప్పి నిను ఒప్పజెప్పి వత్తును. ఇల్లాలి ధర్మము మిగుల యశోవంతమైనది, స్తోత్రపాత్రమైనది. త్వరలో కుక్కుటాశ్రమము జేరుదము రమ్ము.

జఖా—తండ్రీ! వారలు నన్నేమైన యన్న నాగతియేమి?

ధర్మ—ఏమనరు. అందులకు తగుసమాధానము నేజెప్పగలను.

జఖా—తండ్రీ! నే జేసిన తప్పితము మహాఘోరమైనది. ఇదిగాక ప్రపంచమున నాగవారలకు నీతులు లేవు. మగువలకమితమగు నీతులున్నవి. అందులో సతీపతుల ధర్మము లమితములు.

గీ॥ మగువ గయ్యాళి యైనదో ♦ మగనితోడ
తగవులాడిన నది ఇలు ♦ దాటకుండ
మండవతెగావి మీరిన ♦ దండనగును
దాని నెవ్వరు జూడరు ♦ ధరణి యందు॥

గాన నేనధమురాలను, ధర్మరహితను, మగనిని నిర్లక్ష్యముగ దూరిన పాపిని. ఇట్టి పాపికి నరులన్న మీరల వారలు క్షమించి నన్నగైకొందురా? ఆదరింతురా? దరిజేర్తురా? తండ్రీ! నేజేసిన అపచారములకు నీవెట్లు సేయుమన్నను శిరసావహించి జేతును. నీదయయే నాకు జీవనోపాయము. నీబోధయే నాకమిత సంతసము. ఏగతియైనను సేయుము. ఎట్లుజేసినను నీదేభారము.

(25 అనుబంధము.)

ధర్మ—కానిమ్ము రమ్ము పోదము.

(నిష్క్రమించుట-తెరపడును)





శ్రీ

# భక్తపుండలీక.



## చతుర్థాంకము.

[ జహ్ను-సత్య కూర్చొని భజన సేయుచుందురు. ]

(26 అనుబంధము.)

జహ్ను—సత్యా! పుండలీకుఁడు వంటచెరుకులకై వెళ్లి యింకనురాలేదా? పొద్దుచాలా అయినదే.

సత్య—అదో వచ్చుచున్నట్లున్నది.

జహ్ను—దేవీ! దైవమనుగ్రహించెనేని యోగి భోగి యగును. భోగి యోగియగును. మనపుండలీకుని చర్యలెట్లు మారెనో కనుగొంటివా?

సత్య—ఔను నాకును చిత్రముగానే తోచుచున్నది.

జహ్ను—పూర్వమెంత అవివేకిగానుండెనో యిప్పుడంత వివేకి యాయ్యెను. పశ్చాత్తాపమను నది తగుల్కొని ఆపాదమస్తకాంతం ప్రసరించి హృదయమును మార్పుగలిగించినది. ఇకవీఁడు పుణ్యాత్ముఁడు సుమా!

పుండ—[ప్రవేశించి] (27 అనుబంధము.)

తలిదండ్రులారా! క్షమింపుడు. ఈవేళ చాలాపొద్దైనది. దూరమునకేగుటచేత ఆలస్యమైనది.

జహ్ను—కుమారా! యెంతగ శ్రమపడితివో? రమ్ము. కూర్చుండుము. (తలనిమురును.)

—♦ ప్రవేశం ధర్మమూర్తి - జఖాభాయి ♦—

ధర్మ—కుమారీ! అదిగో చూడము. నీ అత్త మామలను, నీభర్త పుండలీకుడు. ఆహాహా! ఏమి యీ మాతాపితృభక్తి. అమ్మాయీ! ఇట్టటి మహాత్ముని భర్తగా బడసిన నీవును, అల్లునిగాబడసిన నేనును తరించితిమి.

జఖా—తండ్రీ! అంతయు వారి దయయే.

[జహ్ను-సత్యా-పుండలీకుడు నుందురు.]

పుండ—(తలిదండ్రుల పాదములొత్తుచు)

(28 అనుబంధము)

జఖా—అత్త మామలారా! నమస్త్రితులు.. ప్రాణేశ్వరా! పాహిమాం, పాహిమాం. (పాదములపై బడును.)

సత్యా—లెమ్ము లెమ్ము (లేవనెత్తి) కోడలా! వచ్చితివా. నేనాటికి మాపై దయగల్గె తల్లీ!

(29 అనుబంధము)

జఖా—అత్త మామలారా! నాతప్పితములెల్ల క్షమింపుడు. నేజేసిన అపరాధములను మన్నింపుడు.

జహ్ను—అదిగో వియ్యాలకులు. ధర్మమూర్తిగారుకూడా వచ్చినారే. అయ్యా! దయచేయుడు. కూర్చొనుడు.

సత్య—కోడలా! ఇప్పుడైనను మాతో సుఖముగ నుందువు రమ్ము.

జహ్ను—నాయనా పుండరీకా! మామగారువచ్చినారు చూచినాడవా,

పుండ—మామగారూ నమస్కృతులు.

ధర్మ—నిరంతర మాతాపితృ సాన్నిధ్యసిద్ధిరస్తు.

జఖా—ప్రాణేశ్వరా! క్షమింపుము. రక్షింపుము. ఇకనన్ను మీదరి చేర్చుకొని మీయొక్కయు, మా అత్తమామలయొక్కయు చరణదాస్యమొసంగి నన్నాదరమున కృతార్థురాలను సేయుము. నాథా!

సీ॥ అత్తమామల మాట ♦ బొత్తిగా వినక కే
పలుపురు ఛీ యన ♦ పలుక నైతి
పతిని నాదరమున ♦ బల్విధంబుల దూరి
న గచాట్ల నెల్లనే ♦ నంద నైతి
అతిథి యభ్యాగతు ♦ లతిహీనతతో జూచి
పలుకష్టముల నేను ♦ బడయ నైతి
విబుధులు పలుమార్లు ♦ విహితముల్ బోధింప
నదివినక పెఃఖంబు ♦ నంద నైతి
గీ॥ అవని యందునగల స్త్రీ ♦ లధమ నైతి
నేరకిని కారగాని చేసెదరి ♦ దూష నైతి
కటకటా దుష్టురాలను ♦ కఠిన నైతి
నాథ! నీదయ లేక ప ♦ నాథ నైతి॥

నీయాజ్ఞమీరను. నిరంతరము నీసేవయే జేతును.

పుండ—తన్వీ! సంతోషము. కలదగిలినగదా! దారితెలియునది. కాని నేకు సుదినము. పతివ్రతలారా! మీరీవ్పుదు శయ్యాపై విశ్రి

మింపుడు. ప్రియసీ! నేతండ్రిగారి పాదములొత్తు చుందును. నీవు మాతృశ్రీపాదము లొత్తుచుండుము. ఈమెసుకుమార చరణములనుగట్టిగా నొత్తకుసుమా! నిర్మలమానసమున భక్తిగా సేవింపుము. మనసార పూజింపుము.

జభా — మహాత్మా! ధన్యనైతిని. నేనునాజన్మతరించెను. కానిమ్ము మీరు జెప్పినట్లె జేసెదను.

జహ్ను— (30 అనుబంధము.)

పుండ — (జై మాతృదేవోభవ. జై పితృదేవోభవ.) తలితండ్రులారా!

సీ॥ కడుగుదునా పద ♦ కంజముల్ పన్నీట
నఘదహనలము చ ♦ ల్లారి పోవ
అలదునా మేనను ♦ లయజగంధంబును
తతిమహాభవఘోర ♦ తాపమార
వీతునా సురభిళ ♦ శీతమారుతముల
కర్మజీమూతముల్ ♦ కదలిపార
అర్పింతునా నవ్య ♦ కర్పూర ధూపముల్
తొలిజన్మ దుర్వాస ♦ నలు నశింప

గీ॥ ప్రేమకు సుమావళుల నేర్చి ♦ భిన్నరహిత
మహిత సద్భక్తి నూతన ♦ మాలగూర్చి
మానసాంజలు లర్పింతు ♦ మరల మరల
తల్లి రావమ్మ! ననుగన్న ♦ తండ్రి రమ్మా॥

ఓ మాతా పితరులారా! మా యిద్దరి భుజముల పై నూర్చుండుడు. కాశీ, ప్రయాగ, గయా క్షేత్రములను దర్శింపు చుందురండు.

జహ్ను-సత్య — నాయనా కుమారా! కానిమ్ము. మిగులసంతోషము.

పుండ — రండి. రండి. (నిష్క్రమించుట) [తెర బడును]

(ద్వారక-కృష్ణుడు-రుక్మిణి)

రుక్మి — (రుక్మిణి-కృష్ణుని తలనిముడుచు) కృష్ణా! నీప్రభావము ఈపదు నాల్గు లోకముల కనుగొనువారులేరనియే తలంతును. సర్వులు నీమాయకులోబడి నటించుచు విపత్సముద్రము నీదుచున్నారు.

కృష్ణ — దేవి! నామహిమ కనుగొన్నవారు పుణ్యాత్ములు. లేనివారు పాపాత్ములు.

(31 అనుబంధము.)

రుక్మి — నాథా! నిజము. యెంతటి వారునుకూడ కనుగొనలేరు.

పుండ — సీ॥ మాధవా నామముల ♦ నాదరంబునవిని
సమ్మతంబున బ్రోవు ♦ నమ్మినాడ।

రుక్మి — నాథా! వినుచుంటిరా ఎక్కడనుండియో దీనాలాపము వచ్చుచున్నది.

పుండ — నాపాపములు బాపి ♦ నన్నుగాపాడుమో
శ్రీహరి బాధలక ♦ జిక్కినాడ।

రుక్మి — స్వామీ! యెక్కడిదీ దీనాలాపము.

పుండ — అపరాధముల నెల్ల ♦ కృపతోడ మన్నించి
సమ్మతంబునగాను ♦ నమ్మినాడ।

కృష్ణ — తన్వీ! యెవడో భక్తుడు వచ్చుచున్నట్లున్నది.

పుండ — గోపాల నాదుసం ♦ కోచముల్ దొలగించి
వాత్సల్యమునగావు ♦ వనరినాడ।

రుక్మి—నాథా! ఇంతవరకెవరిని ప్రార్థించుచున్నది నాకర్థముగాలేదు. మన లనే వేడుచున్నాడు.

కృష్ణు—ఇంకను వినుము.

పుండ—గీ॥ తత్క్షణంబున నన్నిల • తనయుడనుచు
తలచి రక్షించు రుక్మిణీ • ధవ బిరాన

కృష్ణు—ప్రియసీ! ఇర్వురికిని బాధ్యతగలదప.

పుండ—గీ॥ ద్వారకానాథ! సతితోడ • దయనుగల్గి
దర్శనంబిచ్చి నన్ను నీ • దరిని జేర్చు॥

కృష్ణు—దేవీ! యెవ్వరైనది కనుగొంటివా? పుండలీకుడను భక్తుడొనర్చు ఆర్తనాదము.

రుక్మి—జగన్నాథా! యెంతదూరమున నుండియో వినబడుచున్నదే?

కృష్ణు—రుక్మిణీ! నాభక్తులొనర్చు ఆర్తనాదము పదునాల్గు లోకములు ప్రతిధ్వనించును. ఇదియునుగాక నన్ను స్మరించిన వారికెన్నిటికిని కొఅంత యుండదు.

పుండ—శ్లో॥ కృష్ణాయ గోపీనాథాయ । చక్రిణే మురవైరిణే ।
ప్రణుతౌ క్లేశనాశాయ । గోవిందాయ నమోనమః॥

రుక్మి—నాథా! పుండలీకునికి నీవలన ముక్తి గలుగునా?

కృష్ణు—దానికింకను కొద్ది అవకాశమున్నది.

రుక్మి—యెట్టిదది!

కృష్ణు—ప్రియసీ! వీడు భార్యాసహితుడై తల్లితండ్రులతో గూడ ఏనాడు కాశీ గయా మధురాది పుణ్య క్షేత్రములను దర్శించునో ఆనాడు వీనికి నాదర్శనము లభింపగలదు. కొలది దినములు లు తాళితివేని సర్వము నీకు విదితము కాగలదు. రమ్ము జూతువు. (నిష్క్రమింతురు)

( తెరబడును. )

—♦ కాశీ విశ్వనాథ దేవాలయము ♦—

(పుండలీకుడు-జహ్ను-సత్య-జఖా ప్రవేశం)

అందరు—హే కాశికా పుర నిలయా! విశ్వేశ్వరా! పాహిమాం. పాహిమాం.

పుండ—శ్లో॥ శంకరస్య చరితా కథామృతం చంద్రశేఖర గుణానుకీర్తనం।
నీలకంఠతవపాదసేవనం సంభవంతు మమజన్మజన్మని ॥

(33 అనుబంధము.)

తలితండ్రులారా! పోదము రండి.

(నిష్క్రమించుట)

—♦ గయా క్షేత్రం విష్ణుదేవాలయము. ♦—

అందరు—హే దేవాదిదేవా! జగన్నాథా! మహావిష్ణూ! పాహిమాం పాహిమాం.

పుండ—శ్లో॥ శ్రీమత్పయోనిధి నికేతన చక్రపాణే।
భోగీంద్ర భోగమణి రాజిత పుణ్య మూర్తే।
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత।
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం ॥

(34 అనుబంధము.)

మాతాపితరులారా! రండిపోవుదము. (నిష్క్రమించుట)

(గోకుల బృందావనము గోపాలకృష్ణ విగ్రహము.)

ఇదియే గోకులబృందావనము. ఇట్టిపవిత్రమైనక్షేత్రము ఈభరత ఖండము నెందునను లేదు. ఏమి ఈవుత్సవములు. ఏమి యీభజనలు.

(భజనసంఘము ప్రవేశం)

భజనసంఘం— (35 అనుబంధము.)

ఓ భక్తులారా! గోపాలుని స్మరించి చూచిన ముక్తిరండి.

పుండ—పరమానందం. బ్రహ్మానందం.

శ్లో॥ బ్రిందావనద్రుమ తలేషుగవాం గణేషు।
వేదావసాన మయేషుచ దృశ్యతేయత్।
తద్వేణువాదన పరంశిఖిపింఛచూడం।
బ్రహ్మస్మరామి కమలేక్షణ మభ్రనీలం॥

(36 అంబంధము.)

తలితండ్రులారా! అదిగో చంద్రభాగానదీతీరము. డిండీరవనము. అచ్చటికివెళ్లి సంధ్యావందనాది కర్మలన్నియు దీర్చుకొని విశ్రమింతము రండు.

(ప్రవేశం పుండ-జహ్న్వు-జఖా-సత్య)

పుండ—(చేతులు జోడించి) కృష్ణా!
శ్లో॥ శ్రీనాథనారాయణ వాసుదేవ శ్రీకృష్ణభక్తప్రియ చక్రపాణే।
శ్రీపద్మనాభాచ్యుత కైటభారే శ్రీరామపద్మాక్షహరేమురారే॥
ఏమిది సహస్రకోటి సూర్యప్రభాభాసురమైన ఈ తేజస్సు యెక్కడనుండి వచ్చుచున్నది.

జఖా—నాథా! ఈ తేజస్సు జూడ నాకేదియో భయమగుచున్నది.

(37 అనుబంధము.)

పుండ—తన్వీ! భయపడవలదు. ఈవృద్ధుల పవిత్రపాదములను పూజించువరకును యీదివ్యమూర్తియగు రుక్మిణీ ధవుని దయయుండువరకును, యెట్టిఆపదలు మనకురావు. గాన నిరంతరము మనసార వీరిసేవ జేయుచుందుము.

(మరి వెలుతురు ఎక్కువగును.)

పుండ—ఆహా! ఇదంతయు యీభగవానుని మహిమయే మమ్ములపరీక్షింప నిశ్చయించినాడు. భీతినొందిన కార్యముజెడును. మా

తాపిృదైవముల సేవయే ప్రాణాధారము. ముక్తిప్రదము. దీనికంతరాయము గలుగకుండ జూచుకొనవలయును. (యోచించి) దేవాదిదేవా! నీఅనుగ్రహముచే వెనుకటి బాధలన్నియు తొలగె. నీకరుణారసముచే కాశీ, గయాది పుణ్యక్షేత్రములెల్ల సందర్శించితిమి. నీయాజ్ఞచేమాతాపితృ సేవ ననవరతము సేయుచునే యున్నారము. యింకేమైనను జేయ మన్న జవ దాటక జేసెదము. ఇదందయు నీదయయే. నీవు తప్ప నాకన్యులెవ్వరులేరు.

(38 అనుబంధము.)

జహ్ను—కుమారా పుండలీక! ధన్యుడైతివి. ఆనందము, పరమానందము, బ్రహ్మానందము. తనయా! ఇట్టి మహద్భాగ్యము నీయాదరణ వల్లనే నాకు సంప్రాప్తించె. ఆహా! ఏమి! యీసుందర మూర్తి లీలా విలాసములు.

పుండ—పుణ్యాత్మా! జనకా! యెట్లున్నాడు. యెవరిని తలంచితివి. యేమనుచున్నాడు. యేడీ? నాకు కనబడకున్నాడే?

జహ్ను—నాయనా! గోపాలకృష్ణుడు. (చేతులు జోడించి)

శ్లో॥ నమో నమః కారణ వామనాయ ।
నారాయణా యామిత విక్రమాయ ।
శ్రీ శాఙ్గ చక్రాసి గదా ధరాయ ।
నమోస్తు తస్మై పురుషోత్తమాయ ॥

పుండ—(తండ్రిపాదములకు నమస్కరించి) తండ్రీ! ఏమి నీ పుణ్యము? ఏమి నీ భాగ్యము. అనవరతము శ్రీహరి సంకీర్తనలు సల్పినందులకు భగవత్సందర్శన ఫలము సంప్రాప్తించె. జనకా! మన సాంజలులతో పాదములు గడిగి నమస్కరించి కృతార్థత నొందుదు.

పుండ—(చేతులు జోడించి) కృష్ణా! కృష్ణా!

(39 అనుబంధము)

రుక్మి-కృష్ణు—(దూరమునుంచి) భక్తాగ్రేసరా! పుండలీకా! ధన్యుడవు ధన్యుడవు.

పుండ—(నిశ్చేష్టితుడై మోహించి) యెవరు ననుబిల్చునది.

కృష్ణ—పుండలీకా! నీవెవరిని గోరితివో వారే నిను బిల్చునది.

పుండ—యెవరు! ద్వారకాధీశుడైన శ్రీగోపాలకృష్ణుడా నేనునమ్మను. అయిన కృష్ణా కృష్ణా పలుకుము, నిక్కముగా నీవు దేవకీతనయుడవేనా?

కృష్ణ—ఔనౌను.

పుండ—ధన్యుడ! ధన్యుడ! ఓ తల్లీ! ఓ తన్డ్రీ! శ్రీకృష్ణ భగవానుడు సతితోగూడ మనలను సమీపించుచున్నాడు. సందర్శింపుడు పూజింపుడు.

కృష్ణ—భక్తశిఖామణీ! నీభక్తికి మెచ్చితిని. నీవు మిగుల పుణ్యావంతుడవు. నా సమీపమునకు రమ్ము.

పుండ—జగన్నాథా! నా తలి తండ్రుల పాద సేవలో ఇంకను కొంచము కొదువయున్నది. అదిపూర్తి చేసుకొని నీసన్నిధికి వత్తును. నిను దర్శింతును. అంతవరకు మీరీ ఇటికరాళ్లపై నధిష్టించి విశ్రాంతి నొందుడు. కోపింపకుడు.

కృష్ణ—రుక్మిణీ! చూచితివా. పుండలీకుని మాతాపితృసేవ. అనిజమైన ప్రేమ, అనిశ్చలభక్తి, అశుద్ధ మానసిక తత్వము.

రుక్మి—స్వామీ! ఇది గర్వమని దలంతు. నీదర్శనమునకన్న నీసేవకన్న నిది హెచ్చగునే?

కృష్ణ—అయిన దేవీ! అతనినే ప్రశ్నించుము చెప్ప గలడు.

రుక్మి—పుండలీకా! దేవతా సందర్శనముసకంటె నీకు మాతాపితృ సేవయే ఘనమయ్యెనా?

పుండ—తల్లీ! నీవెరుంగని దేదియులేదు. మీ దర్శనము లభించుటకు ఈ మాతాపితృ సేవయేగదా కారణము. ఇయ్యది లేకున్న మీరు నాకు లభింతురా?

రుక్మి—భక్తాగ్రేసరా! నీ నిజమైన భక్తికి సంతసించితిని.

(40 అనుబంధము)

కృష్ణు—(రుక్మిణితో గూడముందుకువచ్చి) పుండలీకా! మెచ్చితిని. నీభక్తి అమోఘము. నీవిశ్వాసమతిశ్లాఘ్యము. నీప్రేమ మతిస్తోత్రము. నీవు మిగుల ధన్యుడవు. మీ వారలందరు పుణ్యులు. నీ ఇచ్ఛ వచ్చిన వరములుగోరుము ఇచ్చెదను.

అందరు—(పాదములకు నమస్కరింతురు.)

పుండ—మహానుభావా! ఈ డిండీర వనములో ఈ చంద్రభాగా నదీతటమున ఈ వటచ్ఛాయ క్రింద ఈ యిటుకరాతిపై నీవిట్లే ఆ కల్పాంతము నిలచి యుండునట్లనుగ్రహింపుము.

కృష్ణు—కానిమ్ము. ఇంకేమి కావలయును.

పుండ—ఇక ఈ ప్రదేశమెల్ల పుణ్యస్థలమై నా పేర పుండలీకపురమై జన వాక్యముచేత పండరి పురమై వెలయునట్లును నిన్ను సర్వులు ఇకనుండి పండరి విఠలుడనియు, పాండు రంగడనియు బిలచునట్లొనర్పుము.

కృష్ణ—భక్తశిఖామణీ! అట్లేయగుగాక. నామహిమచే నీవిందే నొకకుటీరమును నిర్మించుకొని వసించుచుండుము. నీభక్తిప్రభావము వల్ల నిత్యవైభవములతో నిఖిల సంపత్తులతో లక్షలకొలది భక్తులతో వేలకొలది భజన సంఘములతో నొక సుందరమగు దేవాలయము నిర్మితమై వెలయుగాక.

పుండ—ఆహా! శ్రీకృష్ణా! నేటినుండి నిన్ను పాండు రంగడనియే పిలుచునట్లు ప్రసిద్ధి జేసెద.

కృ—పుండలీకా! ఈ ప్రసిద్ధ నామము కలియుగాంత్యమువరకును యెట్టిమార్పు నొందక నుండుగాక. ఇక మే బోయివత్తుము. తర్వలో శిలారూపములతో నేను పాండు రంగడనియు నాసతిరుక్మిణి రుక్మాబాయియనియు సుప్రసిద్ధ నామములచే వచ్చి ఇందున నిలతుము. మీరిందే ప్రసిద్ధినొంది పుణ్యకుటుంబమై వెలసి అంత్యమున స్వర్గమును చేరుదురు గాక. (నిష్క్రమింతురు)

అందరు—జై పాండు రంగ విఠలుకు జై,

(తెరబడును)





శ్రీ

# భక్త పుండలీక.



## పంచమాంకము.



—♦ పండరిపురం విఠోబా రుక్మాబాయి యుండును ♦—

( పుండలీకుడు పూజించు చుండును )

(41 అనుబంధము)

( పుల్లిగాడు-మల్లిగాడు-ప్రవేశము )

(42 అనుబంధము)

( నళిని—ప్రవేశము)

నళి—ఓ భక్తులారా! మీరిచ్చటికి బోవుచున్నారు.

పుల్లి—మా పుండలీకుని సన్నిధికి.

నళి—యెందులకు? బోవుచున్నారు. అందేమి విశేషమున్నది.

మల్లి—అమ్మా! పుండలీకుకు తన భక్తితో పాండు రంగని, రుక్మాబా యిని, ప్రత్యక్ష దైవముగా పండరి పురమున నిల్పియున్నాడు.

నళి—అయ్యలారా! పుండలీకుడన జహ్నుశర్మగారి కుమారుడేనా?

పుల్లి—అమ్మయ్యో! ఆయన పేరు నీకెట్లు తెలుసునమ్మా?

నళి—అంతటి పుణ్యాత్ముం[illegible]నాడా?

మల్లి—ఔను. (కొంత దూరంగాపోయి) ఓరీ పుల్లన్నా! ఈమె పుండ లీకుని జెరిపిన మాయలమారి నళిని. ఈమె బాగా సంపాదించి నిలువ పెట్టినదిరా.

మల్లి—అదెట్లు?

పుల్లి—ఈమె పుండలీకుని ధనమంతయు దోచుకొని దేశమునఅడుక్కొని తినునట్లుజేసినది. అతను దీనిముఖము జూడ నొల్లక భగవధ్యాన పరుడై దేశయాత్రలుజేసె, స్వామికి అనుగ్రహము గల్గె, ఇంతటి మహానుభావుడయ్యె. లేకున్న నిట్లగునా?

మల్లి—ఓరే! నీ యుపాయము బాగా యున్నది, గాని మన మొకటి ఈమెను అడుగాలరా.

పుల్లి—యేమిటది?

మల్లి—పుండలీకుడు విఠోబా దేవునికాలయము కట్టించవలెనని తలంపుగల్గి అనేకభక్తులకు జెప్పి కొంత ధనము సేకరించి దేవాలయమునుకట్టించుటకు ప్రారంభించినాడట, ఈమె ధనవంతురాలు గదా. ఈమెను దేవాలయమునకు కొంత సహాయ మొసర్చమందము.

పుల్లి—ఓరే! ఈమె ధనము మహాపాపకరమైనది. దీనినిస్వామి గ్రహించునా?

(43 అనుబంధము)

వద్దురా వరే దీని ధనమే వద్దు.

మల్లి— (44 అనుబంధము)

పుల్లి—ఓరే! నీవే అడుగుము.

మల్లి—కానిమ్ము.

నళి—(స్వగతమున) ఆహా! యేమి నానీచపుజీవనము. యేమి నానరకపుదేహము. ప్రపంచమున నెట్టి నీచపు కులమునైనా పుట్ట వ

చ్చును, గాని వెలగూలి వంశమున జన్మింప గూడదు. యే యుగమునుండి రాదగినదో ఈ పాపివంశము. యెందరి కొంప లో దోచవలె. యెందరినో జెరుప వలె. యెన్ని కుటుంబములో నశింప జేయవలె. యెందరినో యేడ్పింప వలె. యెందరి ప్రాణములో భక్షింప వలె. యెందరినో జోగులను జేయవలె. యెందరినో మాయోపాయములచే మోసగింపవలె. ఛీ, ఛీ, యేమీ దౌర్భాగ్యపు జీవనము. కన్నవారితో సహవాసము నర్చి కండలెల్ల నశింప జేసుకొని, వచ్చిన వారికెల్ల మచ్చికగా నటించి, వరస వావులు లేక వర్తించి, తుదకు నరకకూపమున మునింగి, పరితపించుటయే గాని వేరుగతి యున్నదా? వలదు వలదు. ఈ హేయ వృత్తి ఇకముందు నశించు గాక. (తన్నుదా చూచుకొని) యేల ఈ సొగసులు పరులను మోసగించుటకే గదా? యేల ఈ చిత్రపటములు నితరుల సంతోషమునకే గదా? యేల ఈ శయ్యాగృహము మరొక్కరికే గదా? ఇంతయు నా మోసమున కాధార పడినవే. చాలు చాలు ఇంతటి వరకు జేసిన పాపములే జగంబంతయు దహింప జేయుచున్నవి. (దుఃఖించుచు) హా! పుండలీకా! యెంతటి మహానుభావుడైతివి. ఉత్తమ జన్మము నొందిన వాడవగుటచే, త్వరలో మేల్కాని నాతగులు వదలుకొని, దివ్యయాత్రలు జేసి తరించి, తుదకు శ్రీపాండు రంగని ప్రత్యక్ష దైవముగా నెలకొల్పి, జగంబునన్ గల భక్తులకెల్ల కోర్కెలొసంగునట్లు జేసి సత్కీర్తి వంతుడవైతివి. యేకాలమున నెట్లుమార్పుగలుగునో తెలియదుగదా.

పుల్లి—ఒరే మల్లన్నా! నళినిగూడ పుండలీకునితలంచి యేడ్చుచున్నదిరా.

మల్లి—ఓర్పు లేక కాబోలు,

పుల్లి—అది కాదురా ఇట్లాంటి వారికి భక్తిగలిగిన సర్వము భగవదర్పితమే, ఇదిగాక దేశమునకు సాధకురాలై, హితము నెలకొల్పి

ఈ నీచ వృత్తిని మాననట్లు చేసును.

మల్లి—ఔను! మనలను సమీపించుచున్నది. మనమనుకొన్న మాటలు వినియున్న దేమో?

పుల్లి—వినిన మాత్రమేమి అమెను మనముదూషించ లేదుగా?

నళి—(సమీపించి) ఓభక్తులారా! మీరే దియో నన్నడుగ తలంచి న ట్లు వినబడితిని.

మల్లి—ఔను తల్లీ!

నళి—యెందులకు?

పుల్లి—పుండలీకుడు పాండురంగని దేవాలయమును గట్టించుటకు,

మల్లి—ఔను. ఔను. తల్లీ.

నళి—ఓభక్తులారా! నాకా పుండలీకుని జూపెదరా? నన్నచటికి గొంపోదురా? పాండు రంగని దర్శన భాగ్యము లభింపజేతురా?

పుల్లి—అమ్మా మా వెంట రమ్మ మాకేట్లయిన నీకట్లే.

నళి—అయ్యలారా! ఇదో మీరు కోరినట్తి నాకు గల ధనమును ఆభరణములను, సర్వము శ్రీ పాండు రంగనికే అర్పింతును. ఈ మాటలు గైకొనుడు.

మల్లి—అమ్మా! ఏమి యిట్లుంటివి. నీబ్రతుకు విధానమాలోచించుకొనుము. నీవారలను జూడుము. ముందు వెనుకలు గుర్తరుగుము. స్వామికి వాగ్దానమొసంగిన తప్పుట సాధ్యముగాదు సుమా.

నళి—భక్తులారా! నా కెవరును లేరు. బ్రతుకు విధానమే నాకువలదు, చాలును. ఆ పాండురంగని జేరి ఆ దేవ దేవుని సందర్శించి ముందిట్టి జన్మము నాకు గాని మరెవరికిని గాని వలదని గట్టిగా ప్రార్థించి తనువు నందే బాసెద.

పుల్లి—ఇప్పుడే మా వెంట వత్తువా తల్లీ?

నళి—పదండి పోదము. (యోగివేషమూని) (నిష్క్రమింతురు)

(తెర బడును)

—పండరిపురం-పాండురంగడువిఠోబాశిలావిగ్రహములుండును—

(పుండరీకుడు పూజసల్పుచుండును)

(మల్లిగాడు-పుల్లిగాడు ప్రవేశము)

మల్లి—పుల్లి—నళి— (45 అనుబంధము)

జై పాండురంగ విఠలుకు జై జై పుండలీక వరదకు జై

(పాండురంగనిసన్నిధి జేరిమూటలు పుండలీకునివద్దనునిచినమస్కరింతురు)

పుండ—భక్తులారా. మీ కనవరతము శ్రీపాండు రంగమూర్తి శుభము లొసంగుగాక.

మల్లి-పుల్లి—మహాత్మా! మీదర్శనముచే మేము ధన్యులమైతిమి.

నళి—(నమస్కరించి నిలువబడి) జగత్పావనా! నీ సందర్శనముచే నా పాపజ్వాల చల్లారె నే ధన్యనైతిని.

పుండ—అమ్మా! పాపములను హరింప జేయుటకై ఈదేవదేవుడిందు నివసించియున్నాడు.

నళి—స్వామీ! ఈ ఆభరణములు విఠలు మూర్తికని రుక్మాబాయికిని ధరింప జేయుము.

పుండ—(మూట విప్పి చూచుచు) తల్లీ! నీవు సువాసినివిగా నున్నావాన వు. ఇవంతయు నీవు ధరించు వస్తువులు. నీ కెవరు లేరా?

నళి—నాకెవరును లేరు.

పుండ—(యోచించుచు ఊరకుండును.)

నళి—మహాస్వామీ! ఏల యోచింతురు.

పుండ—జననీ! నీకు పతి లేడా?

నళి—(దుఃఖించుచు)స్వామీ నన్నడుగకుము. ఆభరణములన్నియు నీవే గమనించిన నీకే సర్వము తెలియగలదు.

పుండ—(ఆశ్చర్యపడి) ఏమమ్మా ! చాలా చిత్రముగా నున్నది. కానిమ్ము. ఈ ఆభరణములు శ్రీపాండురంగదంపతులకు మనస్ఫూర్తిగా నిచ్చుచున్నావా?

నళి—ఔను.

పుండ—ఈ మూటలోని చెప్పు?

నళి—ఇదంతయు నగదు రొక్కము.

పుండ—అమ్మా! యెంత ధనము, యెంత బంగారము. ఇదంతయు యెవరినైనా కొల్లబెట్టి తెచ్చిన దొంగవిగావుగదా?

నళి—కాదు. కాదు. మహాత్మా!

పుండ—(ఒక్కొక్క ఆభరణము తీసి రుక్మాబాయికి వైచుచు ఒకహారమును చేత దీసి కొని) ఏ మి ది? ఇందలి పతకముపై పుండరీకుడని నా పేరు సూచింప బడినది. యెందుండినది. యెక్కడ నుండి ఇందులో చేరెను. ఇయ్యది నే నాడు శృంగార మందిరమున నళిని కొసంగి యుంటిని. (నళినిని చూచుచు గుర్తింపలేక) (స్వగతముగ) అకటా! దైవమా! మరల జ్ఞాపకమునకు తెచ్చుచున్నావు. ఆహా! ఏమి నీలీలా విలాసము. నాచర్యలు మరల జ్ఞప్తికి దెచ్చుటకై ఇట్టి వస్తువు నాచేత నిలపి నన్ను చూచునట్లుజేసి నామనంబున కాశగల్గించు చున్నాడవా? నా వస్తువుగాదు. భక్తులొసంగినయాభరణములివి. (మరలనళినిజూచి) తల్లీ! నీవుధన్యురాలవు. (పాదములపైబడును)

నళి—మహాస్వామీ! నే మహాపాపిని. తాము దైవభక్తులు నాకు నమస్కరింపదగునా? నీదాసురాలను.

పుండ—గుర్తింపతిని తల్లీ! నీవు తప్పక కృతార్థురాలవ్యైవుగాక. భక్తులారా! మీరు ధన్యులు.

(46 అనుబంధము)

నళి—మీయనుగ్రహమే ఇంతకు ప్రధానము.

పుండ—ఇదో తల్లీ! నీఆభరణము లన్నియు దేవతా దంపతులకు ధరింపజేసితిని. నీవొసంగిన ధనము శ్రీపాండురంగని ఆలయమును గట్టించుటకు నెచ్చింతుము. సమ్మతింతువా?

నళి—మహాస్వామీ! పరమ సంతోషము. నన్ను ముందు జన్మమున నిట్టి హేయపు జన్మ నొసంగ కుండునట్లు వారితో నాపరము గ జెప్పుము.

పుండ—అమ్మా! భక్తుల పాలిటి కల్ప తరువు, గాన నీవిందు రమ్మ శ్రీ పాండు రంగని కౌగ లించు కొనుము. నిజమైన భక్తితో భజింపుము. నీకోర్కెల నీడేర్చును.

నళి—(స్వామిని కౌగలించుకొని)

(47 అనుబంధము)

దేవదేవా! నే జేసిన అపరాధము లెల్ల క్షమింపుము. నన్నాద రమున గ్రహించి నీ దాసురాలను ధన్యత నొందించుము. మహాస్వామీ! దర్శనమిచ్చి గాపాడుము.

కృష్ణు—(దూరముగ)అమ్మా! నీకు నే ప్రత్యక్ష దర్శనమొసంగ వీలు లేదు. శిలారూపమున పుండలీకుని యాజ్ఞచే నేను సతితోగూ డ ఇందువసించినారము, గాన నీభక్తికి మెచ్చితిని, నీ కేవరము లు గావలయునో గోరుము.

నళి—జగన్నాథా! రక్షింపుము. రక్షించుము. నాకేమి కోరికెలు గావ లయును. నీయనుగ్రహమున్న చాలును. అయినను ఇయ్యది మాత్రమొసంగుము.

సీ॥ ధనవంతునకు పెక్కు ♦ దానధర్మములిచ్చు
నట్లు బుద్ధినొసంగి ♦ నెరయుమయ్య
మగువ లెల్లప్పుడు ♦ మగనిని దైవంబ
టంచు దలపగ జేసి ♦ గాంచు మయ్య
తనయుడు తలితండ్రు ♦ లనవరతంబు సే
వింపగను భక్తిగా ♦ వింపుమయ్య
సతతంబు నీనామ ♦ స్మరణమ్ము సలుపగ
శాసించి జనులచే ♦ జరుపుమయ్య

గీ॥ జగమునంతను కోసిన ♦ జన్మనాదు
వృత్తులను కాలరాచుచు ♦ విహితమైన
నానులెల్లను పెంపొంద్ధ ♦ సల్పుకొనగ
నెల్లజేయుచు నిరతంబు ♦ నఘము బాపు ॥

స్వామీ! దేశము పాడగు చున్నది మనుజులు హీనతను బొందు చున్నారు. పాపములు పెరుగు చున్నవి. దేవతాది కార్యములు నశించుచున్నవి. భక్తి శూన్యత నొందు చున్నది. జగము చీకటి గ్రమ్మియున్నది. జగదీశా! నీదివ్య జ్యోతిని ప్రకాశింప జేసి జగత్తంతయు నూతన వికాసము వెలిగించి నీమహిమ ప్రజ్వలింప జేసి ధన్యత నొందింపుము. ఇదియే నాకోరిక.

కృష్ణ—అమ్మా! నీమాట లమృతములు. నీకోరికె లతి పునీతములు. నీ ఇష్టానుసారము జరిగింపగల నీపుండలీకుడే గలడు. ఇతడే సర్వమునకు కర్త. (వెళ్లును.)

నర—మహాస్వామీ! పుండలీకా! నీ వేమాకు ప్రత్యక్ష దైవమై నీవే మమ్ముల నుద్ధరింప వలయును. సర్వము నీవే కనుంగొని జగమునంతయు సన్మార్గమున నటింపునట్లు జేసి కీర్తి నిగడింతువు గాక.

పుండ—అమ్మా! అన్నింటికిని ఈ దేవదేవుడే గలడు. తల్లీ! ఇదో పూజా విధాన మెల్ల ముగిసినది. మంగళ హారతి నిచ్చెదను. మీ రందరు శ్రీపాండురంగని ప్రసాదము నంది ధన్యులుగండు.

(ప్రసాదమునిచ్చును.)

(48 అనుబంధము) (మంగళం)

శ్రీ పాం డు రం గ వి జ లా ను జై

# సంపూర్ణము.



# అనుబంధములు



( 1 అనుబంధము రాగం - తాళం )

జవళ్ళు॥ ఏకాలంబున కేగతి గల్గునో। యెవరెరుంగుదురు ॥ ఏ ॥
యెవరికి సాధ్యము కానిది కర్మము। యెవరిని విడువదు ఈ జ
గమునను ॥ ఏ ॥
ఏగతి తప్పించుకొని దిరంగిన విడువదు ఏప్రాణిని యైనన్।
యెందున నుండిన ననుభవింప వలె యే మనినన్ గతి తొలంగ
దు హా ॥ ఏ ॥
ఏడ్చిన విడువదు ఏగతి దొలగదు తుదకా హరియే బ్రోవక
తీరదు ॥ ఏ ॥

( 2 అనుబాధము రాగం-తాళం )

జఖా ॥ వలదీ సంసారము। ఈ కాపుర మ్మింక చాలయ్యోగా ॥ వల ॥
వాలాయముగ నీవసుధన్ కాపురమింకేలా చాలయ్యోగా ॥వ॥
మోదంబు లేదయ్యో వాదంబు మెండయ్యో। ఖేదంబులన్ గల్గె
జూదంబులన్ నిల్చె చాలయ్యోగా ॥ వల ॥
ముదుసలి మా మత్తలతో ఈ మొద్దు మగనితో। బెదరుచు
కాపుర మీడ్వగ చాలు చాలు ఛీ ఛీ యిక చాలయ్యోగా ॥వ॥

( 3 అనుబంధము రాగం-తాళం )

జహ్ను-సత్యె ॥ పాహి పాహి మాం కృష్ణా । పాహి ॥
సకల లోక పూజితా సుర మౌని వేద సంస్తుతా।
భక్త మానవ పోషితా సద్ధర్మ చరిత పూజితా ॥ పా ॥
అనవరతము నీ సన్నుతి ఘనముగ సల్పుచును మదిని
సదమల సద్భక్తిని నెర నమ్మినాము బ్రోవు శ్రీ శా ॥ పా ॥

( 4 అనుబంధము )

జఖా ॥ ( పాట అనవసరము )

( 5 అనుబంధము రాగం-తాళం )

పుండ ॥ ముసలి పీన్గులారా ఊరకె మెక్కి వండరాదా ॥ ఓ ము ॥
ఇరుగు పొరుగు వారలకును మిగడ బిడల తో తొందర గలి
గెను యింకను ॥ ము ॥
నోరు మూసుకొని యొదగి మెలగుచును యూరకె చచ్చిన
రీతి పరుండుము ॥ ము ॥

( 6 అనుబంధము రాగం-తాళం )

సత్య ॥ మాను పూర్వ జన్మ కర్మ మీ విధమున ఫలియించెగా ।
మేగని కడు దురితులమని విధి కట్టల వ్రాసెన హా ॥ మా ॥
సుతులు లేని వంశములకు గతులు గలుగవంచు శృతులు ।
మతివంతులు బల్కెరెరి సుతుల నండి వెతలు గల్గె ॥ మా ॥

( 7 అనుబంధము రాగం-తాళం )

సత్య ॥ జగమున మగనికి తగుసతి దొరకుట పూర్వజన్మ పుణ్యమేగానీ।
తగు గయ్యాళి యై వెలసిన మగనికా ధర బ్రతుకుట దుర్లభ
మానే ॥ జగ ॥
ఆడుదానికతి చనువిచ్చిన చో నధముడౌను పురుషుడునిజమూగా ।
పుడమి యందు సౌఖ్యములు నటించును పడతుల ప్రీతి భలు
వెలంగు నీ ॥ జగ ॥

( 8 అనుబంధము రాగం-తాళం )

సత్య ॥ వినుమో కుమారా విను విను మో ।
మా మొరలను విను ॥ విను ॥
పిన్న తనమునుండి కడు ప్రేమతో గనిపెంచినాము ।
చిన్నతనముపమాన్ని సేయ సరియగునే నీ కిది ॥ వినువినుమో ॥

( 9 అనుబంధము రాగం-తాళం )

నళి ॥ మారుబారికి తాళజాలను రా ।
మోహనాంగా వేగ గాంచ రా రా ॥ మారు ॥
నిను వీడి నిమిసాము నిల్వజాలను నేను ।
మనమున మోదము నొందుచు వేగ రార ॥ బారికి ॥
మరువిరి శరములు బారు దీరి నాపై ।
వాలె బాధలకు నోర్వజాల వేగ ॥ తాళ ॥

( 10 అనుబంధము రాగం-తాళం )

నళి ॥ ద్యా[?]స్య పాట

( 11 అనుబంధము రాగం-తాళం )

సంబం ॥ చక్కని చుక్కల్లో నిక్కుతాడు మాబావ నీకేతగిండాడుగా।
అక్కయ్యా నీకే తగిండాడుగా ॥ చ ॥
ఒక్కసారి యొద్దైన సిక్కి చొక్కాలడుగ ।
పక్కకేపారిపోయెగా।అక్కయ్యా యెందున చిక్కలేడుగ ॥చ॥
టక్కు బిక్కు మాటలకు తై తై లాడుచును నీవు।
చిక్కిన చోచెడదవు గా।అక్కయ్యా చక్కని
వాడు చిక్కెగా ॥ చ ॥

( 12 అనుబంధము రాగం-తాళక )

నళి ॥ జావళీ పాడును.

( 13 అనుబంధము రాగం-తాళం )

మల్లి ॥ చాలురా వెలయాలి పొందు ।
మేలౌనే సంసారి కూడు పసందు ॥ చా ॥
ఇల్లు వాకిలి దానిజేరు మరి ఇల్లాలు పెడదారి గోరు ।
తల్లితండ్రులకంటనేరు బల్ తత్తరమొందుదురవనిసరిరారు॥చా॥
మర్యాద శూన్యంబునొందు మరిమంచి వంశమువెత నొందు ।
దేహంబు శుష్కించి యుండు ఆ దేవుండు నరకమున పడ వేసి యుండు ॥ చా ॥

( 14 అనుబంధము రాగం-తాళం )

పల్లి || నామకోర్కెలెల్లదీరె నామహిమ జగంబు వెలసె |
ఆదరమున నను జేరిన విబుధులు గతి తప్పిరి హా || నా ||
యెందరి కాపుర మిలలో యేగతి గల్పించినానో |
వందలు సమకూర్చి యెంతో వైభవముగ వసియించితి || నా ||
పలుమారులు నన్ను జనుల్ తలపక నూరకె యుండరు |
కలలో నైనను నాకృషి నుతియింపక మానరిలన్ || నా ||

( 15 అనుబంధము రాగం-తాళం )

పుండ || మురవైరీ దీనదయాకర దేవకి నందనా || ము ||
అపరాధిని నన్ కృపతో గావుము || ము ||
చాలును ఇక సంసారపు నరకము భరియింపగ జాలను
జగదీశా || ము ||
తెలియక జేసిన దోషములను నీమనమున నెంచక మమతన్
బ్రోవుము || మురా ||

( 16 అనుబంధము రాగం-తాళం )

పుండ || పరాత్పర శౌరీ మురారీ || పరా ||
పాప విదూరా పరితాపములన్ బాపుమా || పరా ||
పావన వరదా భక్త వినోదా పండితపక్షా మాధవా |
బాధల కోర్వక నీలీలల్ వేడుక నలరన్ గాంచెదవా || ప ||

( 17 అనుబంధము రాగం-తాళం )

గంగ-యమున-సరస్వతి || ధన్యుని జేసెను రమ్మా పిలిచి || ధన్య ||
ధన్యుడు మాన్యుడు మన దర్శనమున || ధ ||
తలి దండ్రిలనిలతగ హింసించిన దురితుడు పీడిల నేడున్
సలిలముగ శ్రీహరిని దలంచెను సాగెను పాపము లెల్లన్ || ధ ||

( 18 అనుబంధము రాగం-తాళం )

కుర్క్ల- మీాదు దర్శనమునను నాజన్మ తరియించెగా ।
ఓ తల్లులారా ! జన్మతరియించెగా నేడే ధన్యుడైతినిగా ॥మీా॥
మున్ను జన్మముల జేసిన పాపము లేదారిని పరుగిడిరెగా ।
మన్నన సేయుడు నా యపరాధము లన్నియు ద్రోసి తరింపగ
సేయుడు ॥ మీాదు ॥

( 19 అనుబంధము రాగం-తాళం )

కుర్క్ల- తలి తండ్రుల సేవకన్న మిన్న యైనది లేదుగా ।
కన్న తల్లి కన్న సన్మపూర్ణ మిన్నగాదుగా ॥ తలి ॥
సకల విధముల గాదు తండ్రి సాటి విశ్వేశ్వరుడు గాదు ।
జనని దివ్యచరణ తీర్థమునకు గంగ సాటి గాదు ॥ తల్లి ॥
దాన ధర్మ జప మంత్ర తంత్ర యాగాదులు జేసిన సరియానే।
మాన సమున నతి భక్తి తోడ మాతా పితృ సేవయు జేసిన
చాలును ॥ తల్లి ॥

( 20 అనుబంధము రాగం-తాళం )

జహన్జ-సత్య । రామకృష్ణా గోవిందా నారాయణా ॥ రామ ॥

( 21 అనుబంధము రాగం-తాళం )

పుండ ॥ తల్లి తండ్రులార మీాదు దర్శనమున ధన్యుడైతిని । తల్లి ।
ఉల్లమునగా ప్రేమ జూపి యుల్లసిల్ల గోప్రుడెంక । తల్లి ।
చేయరాని హింసలెల్ల జేసితి మీా కిలను మున్నే ।
కష్ట పెట్టితి కఠినుండయి కనికరమున గాచుడికగా ॥ తల్లి ।
కఠినుడ చండాలుండను క్రూరుండను పాపుండను ।
ద్రోహిని నీచుడ దుష్టుడ పాపుడ నుమతలేను బ్రోవు ॥తల్లి ।

( 22 అనుబంధము రాగం-తాళం )

సత్య ॥ ధన్యులమైతిమిగా కుమారా జన్మతరియించెగా కుమారా ॥ధ॥
నీకు సేవ గొను భాగ్యము నేటికి గలిగెను మాదు పురాకృత సుకృతము । నేడే సుదినము నిజముగ తనయా పరిత పింపకిక కడు పుణ్యుండవు ॥ ధ ॥
తెలసి తెలియక కను జేసిన యపరాధముల క్షమియు దొలగెను నీవనుభగా । సలలిత హృదయుండగు నీమహాత్ము దర్శన మహిమచే తరియించి తిమిక ॥ ధన్య ॥

( 23 అనుబంధము రాగం-తాళం )

జఖా ॥ నీ ముఖము జూడ నిక పాపీ ॥ నీము ॥
నిను గన మాటాడిండిన పాపము లమితముగను బాధింపగ విడుచుని ॥ నీము ॥
నియతినిని మీరిన చండాలుండవు ఇంక నుండ నే తగనింకగా ।
గొంతులో ప్రాణము లుండు దాక నిను జేర క్షాక ద్రోహీ దుష్ట ॥ నీము ॥

( 24 అనుబంధము రాగం-తాళం )

ధర్మ ॥ హా మ్మాత వలగా హో హో ॥ హా ॥
నిను గన పాపము నియతిగ నిలచును ॥ హా ॥
పావనమగువంశములకు కళంకమాపాదింపగ జేసిన ద్రోహీ॥హా॥
సతిని దైవమని యెంచక దూరిన పాపి నీచ కుల నాశని ఛీ ఛీ ॥ హా ॥

( 25 అనుబంధము )

జఖా ॥ దైవ ప్రార్థన

( 26 అనుబంధము )

జహ్ను-సత్య దైవ ప్రార్థన

( 27 అనుబంధము రాగం-తాళం )

పుండ ॥ ఏలా యీపాపి జన్మ । ఇంకేలా కఠిను డిల పై ॥ ఏ ॥
తలితండ్రుల నిలతల్లడిల్ల జేసిన దురితుడ పాపుడ దుష్టుడ నేనేలా॥

( 28 అనుబంధము రాగం-తాళం )

పుండ ॥ మీపాద సేవనమే ధన్యతమమే ॥ మీ ॥
ఓ మాతా జనకులారా ॥ మీ ॥
భవ హారము సన్నుత చరితము ॥ మీ ॥
యజ్ఞ యాగములు జేసిన గానీ గంగా నదులలో మునగినగానీ।
దాన ధర్మములు జేసిన గానీ తగ దిక మీ సేవ లకును
జగమున ॥ మీ ॥
హరిహరాదులిలదర్శనమొసగిననవనిపతివ్రితలొనగూడినసూ
కనికరమున బోధించిన మీపరి చర్యలకును యీడగు నెద్ది
యగునెగా ॥ మీ ॥

( 29 అనుబంధము రాగం-తాళం )

సత్య ॥ రావమ్మా సుగుణ సుందరీ ॥ రావ ॥
నిను గన నేటికి సంతసమయ్యెను ॥రమ్మా॥
నేటికిమాహైదయగల్గెనుగా నేడేసుదినముగలసితిమో ॥ రా ॥
అను దినమును పతిభక్తి గలిగి మోదమునను నటించి యశము
ను బొందుము ॥రమ్మా॥

( 30 అనుబంధము )

జఖా ॥—

( 31 అనుబంధము రాగం-తాళం )

కృష్ణు ॥ నామహిమ తెలియంగ నెవ్వారు లేరుగా ।
ఈ భువినిక యెవరికి తరముగా నెగా ॥ నామ ॥
మనుజులు నిరతము మాయకు లోబడి ।
పరితపించుదురు పామరులై యిలా ॥ యెవ ॥
తనువిలసుస్థిరమని దలచుచు నెమ్మనమున నాతత్వము దెలసుకొనక।
ఘోర నరక కూపమున మునింగియు నగచుచు వా పోవుచు
ననవరతము ॥ యెవ ॥

( 33 అనుబంధము )

పుండ॥సాంబ సదాశివ శంభో శంకర చరణామ్మే తవచరణ యుగం॥సాం॥

( 34 అనుబంధము రాగం-తాళం )

పుండ ॥ జయ గోప బాల కృష్ణా ॥ జయ ॥

నిరతము నీపద చరణము లను నే పరి పరి విధముల గొని
యాడితి హరి ॥ జయ ॥
పరమ పావనా పంకజ లోచన పద్మనాభ శ్రీరాధా మాధవ।
వేద వేద్య భవహరన తన్నామా వినోద గోపికలీలా బాలా ॥జ॥

( 35 అనుబంధము )

భజన సంఘము ॥ దైవ ప్రార్థన

( 36 అనుబంధము )

పుండ ॥ కృష్ణ స్మరణ

( 37 అనుబంధము )

జభా ॥ దైవ ప్రార్థన

( 38 అనుబంధము )

పుండ ॥ దైవ ప్రార్థన

( 39 అనుబంధము రాగం—తాళం )

పుండ ॥ విడువ విడువ గోపాల కృష్ణా ।
పుడమిలో నీకన్న దైవము లేదిల ॥ వి ॥
అనవరతము నే ఘనముగ మనమున దలచియు నమ్మితి తగ
దిటు నను గన ॥ వి ॥
సతతమునీదయచేయుజగమునదాసులు నిన నమ్మి మును తరియుంచిరో
సెందరు। కవికరమున నను ధన్యుని సేయుగ కాదగు నే నిను
నమ్మిన దాసుడ ॥ విడు ॥

( 40 అనబంధము రాగం-తాళం )

రుక్మి ॥ ఏం తాయో మదిణ గనణ సంతసమయ్యె వినణ ।
మనంబెంతో మోదము గలిగెణ ॥ ఏం ॥
నిను నమ్మిన వారల భక్తుల మహిమలు బాగడగ నేరికితరమా।
ధరణి స్నీదు విలాసము జూడగ నెంతయుమిన లింపణ । మదిణ
గనణ సంతసమయ్యె ధరణ ॥ ఏం ॥

( 41 అనుబంధము )

పుండ ॥ దైవ ప్రార్థన

( 42 అనుబంధము )

మల్లి }
పుల్లి } పండరి నాథా పండరి నాథా పండరి నాథా దయానిధే ।
పాండురంగా భవతరంగా పావనరంగా ఆనందరంగా ॥పండ॥

( 43 అనుబంధము రాగం-తాళం )

పుల్లి॥వద్దురా వెలగూలిపద్దు। దీనిసుద్దేల మనకింక ప్రోద్దాను రా రా ॥వ॥
యెందారి కొంపలు ముంచీ। మరి యెందారినో యేడిపించి ।
వందాల కొల దీని దోచి। దీని తొందార మన కీక వలదు
పోదాము రా ॥ వ ॥

( 44 అనుబంధం రాగం-తాళం )

మల్లి ॥ విడరాను నీని ధనమెల్ల। దీనికి ంపైన పుణ్యము కొల్ల ।
సరియైన కార్యము లెల్ల। ఈ జగమందు ఖ్యాతిని వెదజల్లా ॥వి॥

( 45 అనుబంధం )

మల్లి }
పుల్లి } భజన—దైవ ప్రార్థన

( 46 అనుబంధం రాగం-తాళం )

పుండ ॥ భక్తులార మీరు పాండురంగని దర్శింపుడీ శ్రీరంగని దర్శింపుడీ।
శక్తి మీర నిరతము సంస్మరణ సలుపుడీ ॥ భ ॥
కోరిన కోర్కెల నెల్లను కొల్లగ నిచ్చును రంగడు ।
సారకు మొర్కుల నిడుదేక సత్ప్రద మొసగంగ గలడు॥భ॥
కలియుగమున జనులకు ప్రత్యక్ష దైవముగ నిలచి ।
సలలిత హృదయుండగు శ్రీ రంగని సన్నిధికి రండీ ॥ భ ॥

( 47 అనుబంధం రాగం-తాళం )

నళి ॥ పాండు రంగ ప్రభో కనికరమున నా మొర విని బ్రోవుము
దాసుగాలను ॥ పాం ॥
నిరతము జేసిన అపరాధములకై ।
దొలగక జేసియు కరుణతో బ్రోవుమా ॥ పాం ॥
ధరణిలో నీకన్న నన్యులు లేరు నా ।
మదిని నమ్మి నానిక బ్రోవుము హరి ॥ పాం ॥

( 48 అనుబంధం రాగం-తాళం )

అందరు ॥ జయ జయ మంగళ నామా ।
సన్నుత చరణా గుణధామా ॥ జయ ॥
సాధు పోషణా సంకట హారణా ।
వేద వేద్య భవ సార సంస్మరణా ॥ జయ ॥
భక్త వత్సలా పావన నామా ।
దేవకీ నందనా దివ్య ప్రభావా ॥ జయ ॥

